సరస్వతీ గ్రంథమాల.                48 వ పుష్పము.

# చిట్టెమ్మ.

(సాంఘిక నవల.)

గ్రంథకర్త:

శ్రీరామారావు.

# శాశ్వత మహారాజ పోషకులు

1 మహారాజశ్రీ శ్రీరాజా విజయ అప్పారావు సవాయి అశ్వారావు
జమీందారు, వ. బాదుషాహి మన్సబుదారు సర్కారు,
ముస్తుఫానగరు. సంస్థాన్ పాలపంచ శ్రీభద్రాచలం
అండ్ ఎడవల్లిలు దొరవారు అశ్వారావుపేట.

2 ,, మంగారి నారాయణరావుగారు బ్యాంకర్సు.

3 శ్రీ శ్రీ శ్రీ సురభి వెంకటలక్ష్మమాంబ నిజాం నవాబ్ వంతుబహద్దరు
మహారాణీగారు జటప్రోలు సంస్థానం, కొల్లాపురం.

4 ,, రాజా వెంకటాద్రి అప్పారావు బహద్దరు జమీందారు
గారు ఫుయ్యూరు ఎస్టేటు, నూజివీడు.

5 ,, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు
ఆంధ్రపత్రికా సంపాదకులు, మద్రాసు.

6 ,, జవ్వాది లక్ష్మయ్యగారు ప్రెసిడెంటు యూనియన్
బోర్డు - డిస్ట్రిక్టుబోర్డు మెంబరు, పెనుగొండ.

## రాజపోషకులు.

1 శ్రీ శ్రీ శ్రీ వీర వెంకట సత్యనారాయణస్వామివారు, ధర్మకర్త.
శ్రీరాజా ఇ. వి. ఆర్. యస్. ప్రకాశరాయబహద్దుర్
జమీందారుగారు, ఉంమూరు, అన్నవరం.

2 ,, శ్రీరాజా చింతలపాటి సూర్యనారాయణరాజుగారు,
ఏటికొప్పాక.

9 శ్రీ శ్రీ శ్రీ రేబాల పట్టాభిరామరెడ్డి సోదరులు, జమీందార్లు, నెల్లూరు.
10 ,, డి. వి. సుబ్బారావుగారు, బందరు.
11 ,, నడింపల్లి నరసింహారావు పంతులుగారు, గుంటూరు.
12 ,, జూపూడి కేశవరావుగారు, భీమవరం.

---

# సహాయులు.

1 శ్రీ శ్రీ శ్రీ మోతే కృష్ణారావుగారు జమీందారు, ఏలూరు.
2 ,, కొండూరి నారాయణరావుగారు మర్చంటు ఏలూరు.
3 ,, పైడా శ్రీరామకృష్ణయ్యగారు జమీందారు కాకినాడ.
4 ,, పోలవరపు రామచంద్రరావుగారు ఏలూరు.
5 ,, బసవ సూరన్నగారు అత్తిలి
6 ,, కాసాని అప్పారావుగారు నిడదవ్రోలు.
7 ,, తాడంకి సంజీవరావుగారు జనరల్ మర్చంటు బెజవాడ.
8 ,, కొల్లూరు మహాదేవుడుగారు కరణం, కొక్కిరపల్లి.
9 ,, గొంది కేశవులుగారు ల్యాండుహోల్డరు కొవ్వలి.
10 ,, శిష్టా వెంకటసుబ్బయ్యగారు నర్సాపురం.
11 ,, వాజపేయాజుల రామసుబ్బారాయుడుగారు.
12 ,, సూరిసెట్టి స్వామినాయుడుగారు మగటపల్లి.
13 ,, భూపతిరాజు సూర్యనారాయణరాజుగారు ఖండవిల్లి.
14 ,, నిమిషకవి భవానీశంకరరావుగారు యక్సైజుసబ్ ఇన్స్పెక్టరు.
15 ,, మామిడి సూరన్నగారు ఇనుపపెట్టెలవర్తకులు ధవళేశ్వరం.
16 ,, యం. రామకృష్ణయ్యగారు డాక్టరు నిడదవ్రోలు.

17 శ్రీ శ్రీ శ్రీ దమ్మలపాటి. వెంకట్రావుగారు బాదంపూడి.

18 ,, టి. జీ. బంగారుస్వామిసెట్టిగారు రాజమండ్రి.

19 ,, వరిమి సుబ్బారావుగారు ల్యాండులార్డు తణుకు

20 ,, మెండు వీరన్నగారు ప్రెసిడెంటు డి॥ బోర్డు పినపళ్ళ.

21 ,, యం. దశరధరామరెడ్డిగారు బుచ్చిరెడ్డిపాలెం

22 ,, బెజవాడ వెంకటకృష్ణారెడ్డిగారు బుచ్చిపాలెం.

23 ,, శ్రీ పెండ్యాల శ్రీరామచంద్ర వెంకటకృష్ణరంగారావు జమీందారువారు కొండగూడెం ఎస్టేటు దొమ్మేరు.

24 ,, సామంతుల వెంకన్ననాయుడుగారు పోలీసు ఇన్‌స్పెక్టరు.

25 ,, రంకిరెడ్డి సత్యనారాయణమూర్తిగారు ల్యాండులార్డు వేమగిరి.

26 ,, కే బాబూరావుగారు యక్సైజు సబ్ ఇన్స్పెక్టరు.

27 ,, ద్వారంపూడి వెంకటరెడ్డిగారు అనపర్తి.

28 ,, ఉడత్తు వెంకటరమణగారు రాజమండ్రి.

29 ,, మాజేటి హనుమంతరావుగారు గుంటూరు.

30 ,, తుమ్మలపల్లి వీరభద్రరావుగారు పిప్పర.

31 ,, మియ్యాపుర నాగేశ్వరరావుగారి కుమారుడు రామకృష్ణారావుగారు ప్రయివేటు శక్రటరీ జటప్రోలు సంస్థానము కొల్లాపురం.

32 ,, కొప్పల్లి శ్రీనివాసరావు పంతులుగారు యెస్టేటు మేనేజరు గద్వాల.

33 ,, కోట్ల వెంకటసుబ్బయ్యగారు దివాన్ జటప్రోలు సంస్థానము కొల్లాపురం.

34 ,, నరసింహదేవర సూర్యనారాయణ సోదరులు కంట్రాక్టర్సు వేమగిరి.

35 శ్రీ శ్రీ శ్రీ సమ్మగడ్డ వెంకటరమణయ్యగారు ఐ సి ఐ. సబ్ డిస్ట్రిబ్యూటరు భీమవరం.
36 ,, పసుపులేటి బలరామమూర్తిగారు కోనాల.
37 ,, కరుటూరి సుందరార్రావుగారు కోనాల
38 ,, ఎ నంజుండయ్యగారు సెక్రటరీ డిస్ట్రిక్టుబోర్డు బళ్ళారి.
39 ,, కే హనుమాన్ సింగుహజారుగారు ఆదోని.
40 ,, కే. శివారెడ్డిగారు విలేజిమునసబు కలుదేవకుంట.
41 ,, కే. గోవిందరెడ్డిగారు ఇంగదహాళ్ళు.
42 ,, కే. సి. తిమ్మారెడ్డిగారు ఇంగదహాళ్ళు.
43 ,, చికాల కామేశ్వరరావుగారు సబ్ అసిస్టెంటుసర్జన్ యమ్మిగనూరు.
44 ,, గుమ్మా సత్యనారాయణమూర్తి పంతులుగారు చికకోలు.
45 ,, తంగిరాల రామమూర్తిగారు } టీచర్సు ఆదోని.
46 ,, భాగవతుల వెంకటశాస్త్రిగారు } టీచర్సు ఆదోని.
47 ,, గాదె విశ్వనాథంగారు మార్టేరు.
48 ,, కోనాల పేరిరెడ్డిగారు మార్టేరు.
49 ,, జయంతి రామయ్యపంతులుగారు ముక్తేశ్వరం.
50 ,, సత్తి కామిరెడ్డిగారు మార్టేరు.
51 ,, కర్రి చినవెంకటరెడ్డిగారు మార్టేరు.
52 ,, జంపన సుబ్బరాజుగారు ఖండవిల్లి.
53 ,, పెనుమెత్స సీతారామరాజుగారు అజ్జరం.
54 ,, రావుసాహేబు గుత్తా వెంకయ్యచౌదరిగారు ఏలూరు.
55 ,, వక్కలంక నరసింహంపంతులుగారు ఏలూరు.
56 ,, తెన్నేటి విశ్వనాథంగారు విశాఖపట్నం.
57 ,, పూసపాటి అప్పలనరసింహరాజుగారు జొన్నలవలస

58 శ్రీ శ్రీ శ్రీ అప్పల జగన్నాథరావుగారు ఎలమంచిలి.
59 ,, బొమ్మిసెట్టి లక్ష్మీనరసింహస్వామిగారు నెల్లూరు.
60 ,, మంత్రిప్రగడ నరసింహంపంతులుగారు మద్రాసు.
61 ,, బొమ్మినపల్లి నరసింగరావుగారు నూజివీడు.
62 ,, కాకాని వెంకటసుందరరావుగారు గుంటూరు.
63 ,, టి వి సుబ్రహ్మణ్యంగారు నెల్లూరు.
64 ,, చిర్రావూరి సూర్యప్రకాశరావుగారు టీ ఏజంటు రాజమండ్రి
65 ,, పదకండ్ల గురురాజాచార్య విద్వాన్ ఆదోని.
66 ,, యం. వెంకయ్యగారు ఆదోని.
67 ,, కే. వేణుగోపాలరావునాయుడుగారు తహశీలుదారు ఆదోని
68 ,, యం. వెంకటసుబ్బయ్యగారు పోలీసుఇన్స్పెక్టరు ఆదోని.
69 ,, పెమ్మరాజు లక్ష్మీనారాయణమూర్తిగారు బల్లిపాడు.
70 ,, రావుజీపెర్రిస్ ఆదోని.
71 ,, తోట ధనపతిరావుగారు డాక్టరు తాడేపల్లిగూడెం.
72 ,, చేగొండి రామజోగయ్యనాయుడుగారు దొడ్డిభట్ల.
73 ,, శ్రీమాన్ కొమండూరి గోపాలాచార్యులుగారు దొడ్డిభట్ల.
74 ,, కోనా వెంకటకృష్ణారావుగారు మునసబు విప్పర్రు.
75 ,, హూప్సేన్ పీరాసాహేబుసాధుగారు అనంతపూర్.
76 ,, కోలా రామారావుగారు కంట్రాక్టరు వైజాగ్.
77 ,, చాగంటి సాంబశివరావుగారు వైజాగ్.
78 ,, తంగిరాల వెంకటసూర్యనారాయణగారు
ఎల్. యఫ్. అసిస్టెంటు ఇంజనీరు తాడేపల్లిగూడెం.

# —● కొత్త పుస్తకములు ●—

గ్రంథకర్త:

కొమాండూరి శఠకోపాచార్యులు,

ఎం. ఏ., బి. ఎల్. కాకినాడ.

జగత్కథ:—భూమి ఉత్పత్తి, పూర్వయుగములందు మత్స్య కూర్మ వరాహాది జంతువుల క్రమవికాసము. నరజాతి ఉత్పత్తి, నాగరికత యారంభము, ఆయా మతముల ఉత్పత్తి, వాని సంబంధము, నేటివరకు అన్ని ముఖ్య దేశముల చరిత్రము. వెల్సుగ్రంథ సంగతులే గాక చాల క్రొత్తవియు కలవు. సులభశైలి, చక్కని యచ్చు దేశపటములు సహా సుమారు 780 పుటలు. వెల రు. 3—0—0

టాటాచరిత్రము:—జంషెడ్జి టాటా జీవితము, మన దేశమున నన్నబట్టల మిల్లులు, పట్టు, యినుము, జల విద్యుచ్ఛక్తి పరిశ్రమలస్థాపన, కార్మికసమస్యలు, నౌకాపరిశ్రమ, బెంగుళూరువిజ్ఞానాలయము, ఆధునికపరిశ్రమలస్థితి మృదుశైలిని వివరింపబడినవి. చిత్రపటములతో సుమారు 180 పుటలు. వెల రు. 0—8—0

ఈ రెండును గ్రంథాలయములకు ప్రభుత్వాంగీకారమందినవి.

సహాయచరిత్రము:— మోతీలాలు, జవహరులాలు నెహ్రుగారల జీవితము, గత 30 ఏండ్ల వివిధసంగతులు, గాంధి సహాయుల భావములు, ఇంకను చాల విషయములు, చిత్రపటములుసహా సుమారు 170 పుటలు వెల రు. 0—8—0.

గ్రంథకర్తయొద్ద, ఆంధ్రపత్రికాలయములో ముఖ్య పుస్తకాలయములన్నిటిలోను దొరకును

## జమీన్ రైతు.

నెల్లూరుజిల్లా జమీన్ రైతు సంఘముయొక్కయాజమాన్యమున ప్రతి శుక్రవారము ప్రకటింపబడును. జమీందారులన్న జడుపు ప్రభుత్వమువారన్న భయము నిజంచెప్పుటలో నీ పత్రిక నిర్మొగమాటపు నిప్పు. కార్మికులకిది పట్టుకొమ్మ. ఆంధ్రరాష్ట్రమునందలి రైతులందర అభివృద్ధికొరకు కృషి చేయుటకు కంకణము కట్టుకొన్నది.

సంవత్సరము చందా రు. 4—0—0 నెల్లూరు.

## సాలామిస్రిలేహ్యాం.

వీర్యవృద్ధి, నడుమునొప్పి, కాళ్ళులాగుట, నిస్సత్తువ పోగొట్టి బలము నిచ్చును.

శాస్త్రోక్తముగా తయారుచేయబడిన సకల ఆయుర్వేద ఔషధములు దొరకును.

ధన్వంతరీ ఆయుర్వేదిక్ ఫార్మసీ,
మా రు టే రు.

ఇదివరలో గ్రంథమాలలో బ్రచురింపబడి అమ్మకమునకు సిద్ధముగనున్న
గ్రంథములు.

| | | |
|---|---|---|
| 1 | కనకాంగి Approved | 0—8—0 |
| 2 | ఆనందమయి 2 భాగములు Approved | 1—8—0 |
| 3 | విజయశ్యామ్ Approved | 0—12—0 |
| 4 | ప్రేమమహిమ Approved | 1—0—0 |
| 5 | బిలమందిరము Approved | 0—12—0 |
| 6 | మహారాష్ట్రజీవనప్రభాతము Approved 2 భా | 1—8—0 |
| 7 | దుర్గావతి | 0—12—0 |
| 8 | హాత్యనిరూపణము | 0—12—0 |
| 9 | కష్టసుఖములు 2 భా॥ Approved | 1—8—0 |
| 10 | నీలపూలు | 0—12—0 |
| 11 | పతితనళిని 2 భా॥ Approved | 1—8—0 |
| 12 | అకాలీల సత్యాగ్రహము | 0—12—0 |
| 13 | ప్రేమచంద్రకథలు Approved | 0—12—0 |
| 14 | నీతిముక్తావళి Approved | 0—2—0 |
| 15 | జీవనసంధ్య | 0—12—0 |
| 16 | కలము | 0—2—0 |
| 17 | నాఎలెక్షను అనుభవము | 0—12—0 |
| 18 | రాజ్యపాలనాశాస్త్రము | 0—12—0 |
| 19 | మరణభ్రమ | 0—12—0 |
| 20 | చిత్తోడు పతనము | 0—12—0 |
| 21 | కమలావిలాసము | 0—12—0 |
| 22 | తమోభవనము 2 భా॥ | 1—8—0 |
| 23 | సంయుక్త | 0—12—0 |
| 24 | చిట్టెమ్మ | 0—12—0 |

# కొన్ని ప్రమాణాలు.

యజుర్వేదం, తైత్తిరీయారణ్యకంలో, ఆరవప్రపాఠకం, పదునాలుగో అనువాకంలో, వితంతు వివాహానికి ఈకర్మ విధించబడిఉంది.

భర్తశవం దగ్గర పడి విలపిస్తూఉన్న కాంతదగ్గిరికి ఆమె మరదికాని, బంధువులుగాని వెళ్ళి,

ఉదీర్ష్వనార్యభిజీవలోకమితా సుమేతముపశేషఏహి
హస్తగ్రాభస్య దిధిషో స్త్వమేతత్పత్యుర్జ నిత్యమభిసంబభూవ॥

అనే మంత్రాన్ని పఠిస్తూ, ఆమెచేయి పట్టుకొని లేవనెత్తాలి. అనగా,

" ఓనారీ! చచ్చిపోయిన ఈపెనిమిటిదగ్గిర ఎందుకు పడిఉంటావు బ్రతికి ఉన్నవారిని చూచి లేచిరా, పాణిగ్రాహకుడు- వితంతువును వివాహమాడ ఇచ్ఛగలవాడు ఐన భర్తను వరించు " అని అర్థం. పిమ్మట మృతుడైన భర్తను ఉద్దేశించి,

ఇయంనారీపతిలోకం వృణానానిపత్యత ఉపత్వామర్త్య
ప్రేతంవిశ్వాం పురాణమను పాలయంతే తస్యైప్రజాం
ద్రవిణంచేహ దేహి॥

“ఓమృత్యుడా! నీభార్య నీలోకాన్ని కోరుతూ ప్రేతమైన నీవద్దపడిఉంది. ప్రాచీనమైన పాతివ్రత్యధర్మాన్ని అనుసరించి వర్తించే ఈమెకు ఈలోకంలో సంతానం-ధనంకలిగేటట్టు అనుగ్రహించు”- అనే మంత్రాన్ని పఠించాలి.

## స్మృతులు.

నష్టేమృతే ప్రవ్రజితే క్లీబేచపతితే పతౌ
పంచస్వాపత్సునారీణాంపతి రన్యోవిధీయతే పారాశరస్మృతి.
పాణిగ్రాహేమృతేకన్యా కేవలం మంత్రసంస్కృతా
సాచేదక్షతయోనిస్స్యాత్పున సంస్కార మర్హతివాశిష్ఠస్మృతి.
ఉద్వాహితాపియా కన్యానస్యాస్సంప్రాప్తమైథునా
పునస్సంస్కారమర్హేత యథాకన్యాతథైవసా నారదస్మృతి.
సాచేదక్షతయోనిస్స్యాద్గతప్రత్యాగతాపివా
పౌనర్భవేన భర్త్రాసాపునస్సంస్కారమర్హతి మనుస్మృతి.
అక్షతాచక్షతాచైవపునర్భూస్సంస్కృతాపునః
యాజ్ఞవల్క్యస్మృతి.

# చిట్టెమ్మ.

## ౧

తండ్రి లేకపోయినా అంతదుఃఖించే వారుండరు గాని, తల్లి లేని లోటు కనబడగానే హృదయం చిల్లిపడి రోజుకొక సారైనా తల్చుకుని ఏడవనివారుండరనే నాఊహ. అందులోనూ చిట్టెమ్మలాంటి నిర్భాగ్యురాలికి ఆ వెలితి ఆమరణాంతమూ ఉండేదే. ఎందుకంటారా ! ఆడదానికి తన మనోభావాలన్నీ వెళ్ళబోసుకోవాలంటే, అమ్మైనా కావాలి-హృదయమిచ్చే స్నేహితురాలైనా కావాలి. తండ్రి ఉంటే మాత్రం ఎందుకు ? "వంటఅయింది స్నానంచెయ్యినాన్నా!" అని పిలవడానికి-వేన్నీళ్ళు అందీయడానికీ తప్ప.

"వచ్చిపోయి చూచువాడుగా కిడుమలబడునె, తల్లి పోలె, బట్టితోడ-తండ్రి?"

సంజెచీకటి క్రమంగా విచ్చి గుడ్డివెన్నెల ఇళ్ళ కప్పులమీద-చెట్లచివరా పడుతోంది. అప్పుడే వంటచేసేసుకుని దొడ్లో చీడీలమీద ఒక్కతే కూర్చుంది చిట్టెమ్మ. "ఊ" అనేవారు లేరు. "ఆ" అనేవారు లేరు.

ఆమె లేతహృదయంలో తలఎగలుకట్టుతూఉన్న ఊహాలనన్నిటినీ బయటికి వెళ్ళగక్కాలంటే ఎవరున్నారు! గాలి-ఆకాశం-తులిశెమ్మ-దొడ్లోనుయ్యి.

చందమామ బాదంచెట్టుపై ఆకుల్లోంచి తొంగి చూస్తున్నాడు. గిరికందరాల్నించి వచ్చే పిల్లగాలులు చల్లగా వీచుతున్నాయి. ఐతే అవెంతవరకు చిట్టెమ్మ హృదయ తాపాన్ని చల్లబరుస్తాయి. తనకు ఎప్పటికైనా తగిన శైత ల్యాన్ని ప్రసాదించేది అది-అచల్లని కడుపుతల్లి-కృష్ణవేణమ్మ ఒక్కతేనని అప్పుడప్పుడు చిట్టెమ్మకి లీలగా తట్టుతూ ఉంటుంది.

చీడీలమీద పైటపరుచుకొని పడుకుంది. ఆకాశంలో మినుకు మినుకు మంటూ ఎన్నో నక్షత్రాలు మెరుస్తున్నాయి. వాటిఅన్నిటికీ పేర్లున్నాయి. అందులో ముఖ్యంగా చిట్టెమ్మకి తెలిసినవి సప్తఋషులూ అరుంధతీను వసిష్ఠుడనే ఒక తారకు అరుంధతి అనే ఒక చుక్క భార్య. ఆర్యసాంప్రదాయంలో గాలికీ-నీళ్ళకీ-నిప్పుకీ కూడా పెళ్ళాలున్నారు. ఆలాగే నదులకీ వాటికీ భర్తలున్నారు. చిట్టెమ్మకి ఇవన్నీ తల్చుకుంటే నవ్వూ విచారంకూడా కలిగాయి.

మెయిలువెళ్ళిన తరువాత దీక్షతులుగారు వచ్చారు రైలుసంచీ ఆయనానను.

"ఏం! నాన్నా! మోటారుమీదే వస్తానన్నావుగా" అంది చిట్టెమ్మ తలుపు తీస్తూనే.

"అలాగే అనుకున్నాను మొదట. ఐతే తంటాలుపడి రోడ్డు సరిగా లేదే అమ్మాయి! వెళ్ళేటప్పుడు నావొళ్ళంతా పచ్చిపుండయింది."

"కాళ్ళుకడుక్కోండి. తొమ్మిది దాటింది కాబోలు."

"వేన్నీళ్ళున్నాయిగా."

"స్నానానికా!"

"మరే!"

"రెండు చెంబులు నీళ్ళున్నాయి."

"చాలే. కాస్త ఒళ్ళు కడుక్కుంటేనేగాని. రైల్లో కిరస్తానీవాళ్ళూ - తురకాళ్ళూ రాసుకు కూర్చుంటారు. మూలగా ఒకావిడ కూర్చుంది. వాకిటున్న మనిషే మోనని అనుమానం. అంతా మూలకూడు."

పిలక మొదలు కాలిచిటికెనవేలుగోరుదాకా ఆకాసినీన్ని నీళ్ళతోటి తడుపుకుని విభూది లెస్సగా మెత్తుకుని చిట్టెమ్మ వేసిఉంచిన పీటమీద ఆశీనులయ్యారు దీక్షితులుగారు.

"కానీ! ఈలోపుగా సంధ్యావందనం కూడా ఐపోతుంది. వడ్డించు" అన్నారు. కూతురిచ్చిన పంచపాత్రిలో నీళ్లు ఉద్ధరణతో మూడుసార్లు నోట్లోకి ఎగరేసుకుంటూ.

చిట్టెమ్మ వడ్డన పూర్తిచేసేసరికి ముక్కు మూసుకోవడం-వేళ్ళసందుల్లోంచి తావళాన్ని పరుగెత్తించడం-గబగబ అష్టావధానం మాదరిగా జరిగిపోయాయి. నాలుగు మెతుకులు

ముందుగా కొరిగి ఉద్ధరిణెడునీళ్లు లోపలికి పుచ్చుకుని-ఒక దగ్గు దగ్గాడు. అది నెయ్యి వడ్డించమనడానికి గుర్తు. భోజనసమయంలో ఆయనను మాట్లాడకూడదనే వ్రతం ఒకటి. ఐతేఏం! లోటులేకుండా పదార్థాలన్నీ తృప్తిగా పుచ్చుకోవడంలో ఈమౌనం అభ్యంతరపరచదు. సౌంజ్ఞ చేసి కావలిసిందేదో వేయించుకుంటాడు. ఉప్పుగాని, కారంగాని, ఎక్కువ తక్కువైనపుడూ మజ్జిగలో చీమ కనిపించినప్పుడూ పెదవి విరిచి కోపంకూడా వ్యక్తపరచడంకద్దు. ఐతే మౌనం.

చిట్టెమ్మ భోజనంకూడా అయి ఇవతలపడేటప్పటికి సరిగ్గా పదకొండూ కొట్టారు. తండ్రిగారి గదిలో మంచినీళ్ళ చెంబూ, ఉప్పునీళ్ళచెంబూ ఉంచి, సావిట్లో చాపవేసుకుని మేను వాల్చిందోలేదో "అమ్మాయి!" అని పిలుపు.

ఆమె లోపలికిపోయి నిలబడగానే "చూడు! కాళ్లు మూ సలుపెత్తిపోతున్నాయి, గాని కాస్త చెయ్యివేద్దూ!" అన్నారు దీక్షితులుగారు.

చిట్టెమ్మ కాళ్ళు పిసుకుతుండగా ఆయన ఈవిధంగా ప్రారంభించాడు.

"ఏమయిందనుకున్నావ్ మాఘమాసంలో నిశ్చయ పరిచాను. అప్పటికి కాని వాళ్ళుతూగలేమన్నారు. ఉత్త డబ్బు పితలాటకం మనుష్యులు సుమా వాళ్ళు. పుష్యంలో

జరిపించకూడదా అని నేనడుగుతే డబ్బు లేదు మొర్రో అంటారే. వాళ్ళు డబ్బు ఇద్దపోనూ. ఎప్పుడూ ఒకటే దరిద్రమైపోయిందీ. వాడికీ- పెద్దాడికీ నలభై ఇస్తారు. రెండో వాడు స్కూలుమేస్టరేనాయె. పైగా ప్రైవేట్లూ అవీ చెప్పి సంపాదిస్తాడు. పోదు ! ఎంతొస్తే ఏమిటే! పరువు మర్యాదలు తెలియకపోయాక. ఐతేనా చూశావ్రా! అది-పిల్లది-మీపిన్ని ఎంతమనిషయిందనుకున్నావ్. పొడుగాంటి జుట్టూ- అదీను"

## ౨

దీక్షితులుగారు చెప్పిన విషయం తన పునస్సంధానాన్ని గురించి. నలభై ఐదో యేడు పైబడ్డా మనిషి ఏమాత్రం జంకలేదు. మంచి పటుత్వంగానే ఉంటాడు. కాని జరీపిలకా జారినబొజ్జా ఆయన వయస్సుని ప్రకటిస్తూనే ఉంటాయి. మీసాలు గొరిగించుకోవడంవల్ల మనిషి నున్న నున్నగా కనబడతాడు. ప్రథమకళత్రవియోగం తటస్థించగానే తిరిగి వివాహం చేసుకునేదాకా పాపం తహతహలాడిపోయాడు. ఐతే పెళ్ళి కావడానికి ఆయనకేంతక్కువ గనుక పాతిక ముప్ఫైవేలు ఇనపపెట్లో పిల్లల్ని పెడుతున్నాయి. అదికాక నలభై ఎకరాల కొండ్రా బెజవాడలో డాబా ఉన్నాయి.

ఇక పిల్లలకి కరువేముంది? పదిరాళ్లు కూడబెట్టినవాడల్లా తగినవరుడే. "మీకు కావడానికేముండి. కో అంటే కోటి మంది. ఐనా బెంగచేత ఇలాఉన్నారు గాని జట్టూ అదీ నెరిసి మీకుమాత్రం వంవయసు ముదిరిందని. అవశ్యం వివాహం చేసుకుని గార్హస్థ్యాశ్రమాన్ని నడపాలి." అంటూ ఆయన అభ్యుదయాన్ని కోరేవారంతా చెవి ఇల్లుకట్టుకుని పోరుతూఉండేవారు.

చివరకి గుడివాడలో ఐలావఝ్ఝల సోమయాజులుగారి పిల్ల పదమూడేళ్లది ఉంటే తొరగావస్తుందని చేసేసుకున్నాడు దాంతో ఆయన కాపురం కుదుటపడ్డది. కన్య చదువు కున్నదికూడాను. అంత ఎరుపుకాకపోయినా చామన చాయలో కళకాంతులుగల మొఖం. చక్కటి విగ్రహము న్నూ. తుదకు మంచిసంబంధమే దొరికిందని తృప్తిపడ్డా డాయన.

ఇక చిట్టెమ్మసంగతి మొదటినుంచీ వైదిక సాంప్రదాయంలో బతికినవాడవటంచేత దీక్షితులుగారికి ఇంగ్లీషు చదువుకున్న అల్లుడొస్తే బాగుండుననిపించేది. ఎటుచూచినా తన దగ్గరబంధువుల్లో ఆంగ్లేయభాష తెలిసినవాళ్లెవరూ లేకుండావచ్చారు కనక తాను ఆలాంటిసంబంధం చేస్తే నలుగుర్లోనూ గొప్పగాఉంటుందని ఊహించాడు. అల్లుడు ఏ మేజిస్ట్రీటో కోర్టుమునసబో చేస్తూఉంటే ఆయన మామ

గార్ననిపించుకుంటూ దర్జాగా బజారువర్తకులమీద ధాటీ చెయ్యాలని మనసుగా ఉండేది.

ఆఊరూ ఈఊరూ గాలించి ఆఖరుకి గుంటూరులో బి, యే. చదువుతున్న కర్రివాడొకడుంటే అన్నివిధాలా నచ్చి అతనికిచ్చి చెయ్యడానికి స్థిరపరుచుకున్నాడు. కట్నం లాంఛనాలుఅన్నీ యథావిధిగా ముట్టచెప్పి పెళ్లి పెద్దెత్తులోనే చేశాడు. ఆనాలుగురోజులూ దీక్షతులుగారిపని ఆరుపువ్వులూ పన్నెండు కాయలూగాఉంది. డబ్బు గవ్వలు గచ్చకాయలుగా వెచ్చించి కొంత పేరు కొనుక్కున్నాడు.

బందరులో దీక్షతులుగారి చెల్లెలు ఒకావిడ ఉంది. ఆవిడకు ఇరవైయేళ్ల కొడుకున్నాడు. చిట్టెమ్మని తన కొడుక్కి ఇవ్వకుండా ఇతరత్రా చేశాడని ఆమెకు కోపం కంఠందాకా ఉండేది. నిజమైతే తెలియదుగాని చిట్టెమ్మే అతన్ని పెళ్లిచేసుకోడానికి ఒప్పుకోలేదనికూడా ఆవిడకి అనుమానం. ఆవిడా పెళ్ళికివచ్చింది. దీక్షతులుగారు మేనరికం చెయ్యలేదనేలోటు కనబడకుండా చెల్లెలికి రెండువందలదాకా ముట్టచెప్పాడు కాని ఆమెకు పెదిమలు నవ్వుతూ ఉంటే నొసలు వెక్కిరించేవి. పైకి ఎంత సంతోషంనటించినా లోలోపల మనసు తిట్టుతూనే ఉండేది. పో! ఆఅమంగళవాక్యాల చిట్టెమ్మకి తగలకుండాపోలేదు.

సంవత్సరం తిరిగొచ్చిందో లేదో ఒకరోజున చిట్టెమ్మ పొరుగింట్లో ఆడుకుంటూఉంటే దాసీది పైడి కళ్ళనీళ్ళు గుక్కుకుంటూ వచ్చి "అమ్మాయిగారూ! ఇంటికిరండి." అని పిలిచింది.

ఎందుకో అనుకుని చిట్టెమ్మ ఇంటికిరాగానే ఏముంది. తల్లి ఎదురుగుండావచ్చి ఆమెను కౌగిలించుకుని బావురుమంది. దీక్షితులుగారొకమూల తలపట్టుకుని కూర్చున్నారు. ఆయన్ని ఓదార్చలేక హైస్కూలుమాష్టరు వెంకటాద్రివుగారు టెలిగ్రాం చేత్తోపట్టుకుని తెల్లబోతున్నాడు. వారూ వీరూ పదిమందీ పోగయ్యారు.

"ఎంతపనిజరిగింది ఎంతపనిజరిగింది" అంటూ ముక్కులమీద వేళ్ళుంచుకొనేవారు కొందరు "చూడండి! ఇంత చిన్నతనంలో ఈరాత" అని కొందరు. రకరకాలుగా అనుకున్నారు.

"దానిమొఖాన్ని అలా రాసిఉందిగామోను" అన్నదొక గంగాభాగీరథీసమానురాలు.

సరే! ఎవరికితోచినట్లు వారు చిట్టెమ్మ వైధవ్యానికి నామరూపాలులేని సృష్టికర్తని చెడా మడా తిట్టి ఊరుకున్నారు. "కర్మ కర్మ పురాకృతకర్మ" అంటూ అందులో జ్ఞానులుకొందరు ఎలుగెత్తి చెప్పారు.

ఇంతకూ ఈదారుణానికి కంటతడిపెట్టనివారంటూ లేరు. చిట్టెమ్మకిమాత్రం ఏమీ తెలిసిందికాదు. అందరూ ఏడుస్తూఉంటే ముద్దుమొగం కందేటట్టుగా తనూఏడ్చింది. అంతేగాని తన తొమ్మిదోఏటనే తనకి తెలియకుండా తన జీవనవృక్షానికి గొడ్డలివేటు తగిలిందనీ ఆదెబ్బకితాను చచ్చే వరకూ ఒరిగిపోయిఉండాలనీ పసిపిల్ల ఆమెకేమితెలుసు!

చిట్టెమ్మ పెనిమిటి పాపం మదరాసులో బి. యల్. చదువుతూ క్రితంరోజున సముద్రంలో స్నానంచెయ్యబోయి తిరిగి కనిపించలేదు అదీ కులిగ్రాంలోఉన్న దుఃఖవార్త. వానరాకడ ప్రాణంపోకడ ఎవరికీ తెలియదుగదా!

ఆరోజు కారోజు వయసుతోపాటు గ్రాహ్యతకూడా చిట్టెమ్మకి అభివృద్ధి అవుతూనేవుంది. శ్రావణమంగళ వారాలూ శుక్రవారాలు నోములు అవీవచ్చినపుడు తన ఈడు పిల్లలంతా పేరంటానికి వెళ్ళడం తననెవరూ పిలవక పోవడం కనిపెట్టింది చిట్టెమ్మ. ఒకవేళ పిలవడం మర్చి పోయారని తానేవెళ్ళిందా; ఎవరూ కాళ్ళకి పసుపూ పారాణీ రాసేవారేకారు. చివరికి బొట్టుకూడా పెట్టరు. ముసలివాళ్ళు చిన్నపిల్లలు సగ్గున్నంచి అంతా గంధం అదీ రాసుకుని తనకు రాయకపోవడం అందరూ తనవైపు మిర్రు మిర్రు చూడడం చూస్తే ఏదో చిన్నతనంగా తోచేది. కాని, కాస్సిన్ని శనగలు చిట్టెమ్మఒళ్ళోకూడా పోసేవారు.

ఒకసారి చిట్టెమ్మ ఏంచేసిందా ! ఆశనగ లక్కడ పార పోసి-బిక్క మొగం పెట్టుకుని ఇంటికొచ్చేసింది. ఇదంతా చూసి భరించరాని అవమానంగాకూడా తోచేదామెకు.

ఇంతేకాదు. దినదినమూ, ఆమె ఈస్వల్పజీవితంలో అనేక అవమానాలూ - అనేకఘటనలూ జరుగుతూ వచ్చాయి. ఈఅన్నిటివల్లా ఆమె చిన్నహృదయం ఎంతో ఘాత పొందేది.

ఒకనాడు చిట్టెమ్మతో రోజూ ఆడుకునే రాజామణి కొత్తపరికిణీ- కొత్తచొక్కా తొడుక్కుని పెళ్ళిసమయాన్ని అత్తవారుపెట్టిన నగలన్నీ అలంకరించుకుని ఆటకొచ్చింది.

"ఏం, ఓవిడా ! ఈవేళ శింగారించావ్ !" అని అడిగింది చిట్టెమ్మ.

కళ్ళల్లోసిగ్గూ- లేతబుగ్గలమీద చిఱునవ్వూ తొణుకాడుతూ రాజామణి "ఏంలేదు. ఊరికేనే" అంది.

ఆమాటకి పక్కనున్న కోమాటీరమ్మాయి అందిగదా ! తలఊపుతూ "నేఁ చూశానమ్మా ! రాజామణి మొగుడొచ్చాడు. రామంగారు ఇందాకా మాకొట్లో గోధుంపిండి - పంచదారా - ద్రాక్షపళ్ళూ- సగ్గుబియ్యం- అవీ కొనుక్కెళ్ళాడు."

ఆనాడు చిట్టెమ్మకి ఆటమీద ధ్యానంతప్పింది. ఏదో వంక చెప్పి ఇంటికొచ్చేసింది. తనకంటే రెండు నెలలు

చిన్నదైన రాజామణి మొగుడొచ్చినపుడు, తనభర్త ఎప్పుడూవచ్చినట్టు లేదే ? ఇదే ఆమెకు పట్టుకున్న దుగ్ధ. అయితే భర్తఅంటే ఏమిటో - ఏమీ తెలియని వయస్సు. ఐనా ఎందుకో సందేహం. తనూ అప్పుడప్పుడు కొత్తపరికిణీ- అవీకట్టుకొనేది. వస్తువులుకూడా పెట్టుకునేది. కాని ఆమె భర్త రాలేదే.

# 3

అప్పటికి చిట్టెమ్మ తల్లి బతికేఉంది. ఈమె పినతల్లి- ఆమెకూతురు కమలం వీరింటికెందుకో వచ్చారు. భోజనాలయాక మధ్యాహ్నం చిట్టెమ్మతల్లి కమలానికీ - ఈమెకూ జడ వేసింది. పినతల్లికూడా అక్కడేఉంది. కమలానికి జడలో చామంతిపువ్వులు కుట్టింది. చిట్టెమ్మకు వుత్తజడే - యిద్దరు సబ్బుతో మొగాలుకడుక్కొచ్చారు. కమలానికి బొట్టూ - కాటుకా పెట్టింది వాళ్ళఅమ్మ. తనకుకూడా పెడుతుందేమో అనుకుంది చిట్టెమ్మ. కాని ఎంతసేపు చూచినా ఆపనిజరగనే లేదు. రెప్పవేయకుండా కమలం బొట్టువేపు చూసింది. చాందు నిగనిగలాడుతోంది. ఒకసారి తననుదురుకూడా తడిమిచూసుకుంది. నున్నగాఉంది.

"బొట్టూ - కాటుకా పెట్టుకుంటే కమలం ఎంతో అందంగాఉంది" అనుకుంది చిట్టెమ్మ మనసులో.

"మాదొడ్లో పూవులుగదా: రోజూ రెక్కలు విరిగేటట్టు నీళ్ళుపోసి పెంచాను. నాజడలో ఒక్కటేనా పెట్టకుండా అన్నీ కమలం జళ్ళోనే తురిమేసింది మాఅమ్మ". అనుకున్నప్పుడు చిట్టెమ్మ కళ్ళల్లో నీళ్ళు గిరుర్రున తిరిగాయి, తల్లిమీద కోపంకూడా వచ్చింది.

మొగం ఇంతచేసుకుని కూర్చుంది చిట్టెమ్మ. ఇంతకు ముందు తానెప్పుడూ బొట్టుపెట్టుకున్న జ్ఞాపకంలేదు. ఇప్పుడు పెట్టుకుంటే ఎలాఉంటుందో! పెట్టుకుంటే: బొట్టు పెట్టుకుంటే! ఎలాఉంటుందో.

సరే. పెట్టుకోనడం ఎలాగ? పిచ్చిపిల్ల. ఏమిటో ఆమెకి కడుపు తరుక్కుపోయినట్లైంది. దీనంగా తల్లికేసి-పినతల్లికేసి చూసింది.

అమాయికమైన ఆచూపుకి పినతల్లి హృదయంనీరై "అక్కయ్యా! చూడవే పాపం చిట్టి ఎలా చిన్నపోయి చూస్తోందోను. దానికికూడా బొట్టూ - కాటుకా పెట్టవే చూద్దాం." అంది.

ఆమాట అనేసరికి తల్లి కంటనీళ్ళు బొట - బొట రాలి" అంత అదృష్టమేఉంటే ఇలాఎందుకు కాలిపోతుంది. దాని బతుకు" అంది విచారంగా.

"దానికేం చేస్తాం. ఏదో చిన్నతనం. ముద్దూ - ముచ్చటా ఏమి లేకపోయింది ఒక్కతేపిల్ల అయినందుకు. పాపిష్టిదైవం ఇలా చెయ్యాలామరి. మరేం పరవాలేదులెద్దూ. ఎవరు చూడొచ్చారూ ? బంగారంలాంటిపిల్ల-బొట్టులేకుండా ఎక్కడ రాసిఉందో దాని నుదుటిమీద. ఒకమాటుపెట్టి చూడు. మళ్ళా చెరిపేద్దాంలే. అయినా ఈరోజుల్లో పెద్ద వాళ్ళే రహస్యంగా పెట్టుకుంటున్నారు రాత్రిళ్ళు. ఇలాంటి చిన్నపిల్లలకి ఏమిటేపం ? తప్పా ?"

చెల్లెలిపట్టుదలచేత ఎలాగో తప్పని సరివొచ్చి ఆమె బొట్టూ- కాటుకా పెట్టింది. ఇప్పుడు చిట్టెమ్మకి ఎక్కడలేని కళకాంతులూ వచ్చినట్లున్నాయి. అసలే చంద్రబింబం లాంటి మొఖం. ఇప్పుడు ఆబింబంలో రెండుకాటుకపిట్టలు.

"చూడవే. అక్కయ్యా ! చక్కటి చుక్కలాగుంది. ఇప్పుడు చిట్టి. రోజూ ఇలాఉంటే ఎంత బాగుండును."

"ఉంటేఏం ? కమలంలేమా !'' అని చిట్టెమ్మ హృదయం పలుకాడింది.

"ఏదీ మంచి పరికిణీ- చొక్కాకూడా తొడుగు. నగలన్నీతియ్యి చూద్దాం, ఒకసారి." అంటూ ఉత్సాహం తో పినతల్లి తొందరపెట్టింది.

కొత్త పరికిణీ - కొత్తచొక్కా- నగలూ - ఇవికాక కొత్తగా రెండుమంగళ సూత్రాలూ, చిట్టెమ్మ సహజ

సౌందర్యానికి వన్నె తెచ్చాయి. నిజంగా ఇప్పుడు చిట్టెమ్మ వసంతకాల మల్లికాప్రసవంలాగా - మబ్బులు లేని చంద్రకిరణంలాగా వెలిగిపోయింది.

ఒక్కసారిగా మాతృహృదయం ద్రవించి- ఆమెకి బిడ్డమీద ఉన్న ప్రేమ కెరటాలు లేచి, మృదువైన ధ్వని ఇచ్చింది. చిట్టెమ్మని కళ్ళనీళ్ళతో ఒళ్ళోకి తీసుకుందితల్లి.

మాతృప్రేమ అగాధం- అపారమూను. ఆప్రేమ సరసిలో ఈదులాడే ఆకూనకి తప్ప ఇతర్లకెలా తెలుస్తుంది. ఆఆనందం- ఆతన్మయమూను.

"ఈవిధంగా అప్పుడప్పుడు పిల్లకి అలంకరించుకుంటూ ఉండు. ఊరికే పిచ్చిచాదస్తాలకిపోక. దీనికర్మం కాలి ఇలా అయిపోయిందిగాని, నిజానికి చూస్తే దీనికేం తక్కువ. దేవకన్నెలాగుంటుంది. అందరికిమల్లే చూసి ఆనందించే ప్రాప్తం లేనప్పుడు ఏంచేస్తాం; దొంగచాటుగానేనా ముస్తాబుచేసి, ఇలాగే దొంగసంతోషం- దొంగసౌఖ్యం అనుభవించాలి మరి. అంతే. ఎంతఇదైనా కన్నకడుపుగదా ! నీమాంసంలో మాంసంగదా ! నీబిడ్డమీద నీకుండే ప్రేమ, అభిమానం లోకులకెందుకుంటుంది ! వాళ్ళసొమ్మేంపోయింది ! వాళ్ళకీ వీళ్ళకీ జడిసి నీఆత్మని చంపుకుంటావా ! నీకామాత్రం స్వతంత్రంలేదూ ! దీనిమొగుడుచస్తే దీనిదోషమేముంది. ఆకులురాలిన మోడులాగా ఎండబెట్టడానికి మానవ

ధర్మంలో ఎక్కడుందో! ఇందాకా నువ్వేఅన్నావుగా, చేమంతిఅంటు పువ్వులన్నీ కోసేస్తే ఎలాచిన్నబోయుంటో అని! నీబిడ్డ నీకడుపున పుట్టిన నీస్వరూపం ఇలా తేజోదరిద్రంగా ఉంటే చూడడానికి నీమనసెలా ఒప్పింది! ఏదీ పెళ్ళాంచావగానే మొగాణ్ణి జందెం తెంపుకుని - ఏఅంగో వస్త్రపు గుడ్డో కట్టుకుని కూర్చోమను చూద్దాం. ఏం? ఒప్పుకోడేం? అబ్బా, ఆడా - మొగా అన్నంతమాత్రంలో తమకేగాని ఆడదానికి హృదయంలేదూ! వాంఛలుండవూ! దీన్నిమాత్రం శరీరంకాక ఏపాతచొక్కాయేనా!'' అంటూ ఆవేశంతో పినతల్లి గబగబా అనేసింది. ఆమాటలు తల్లి హృదయంలో అతిభద్రంగా ఇముడుకుంటున్నాయి.

"లోకం ఒప్పుకోంటుందిటే. శాస్త్రాలుహార్షిస్తాయా!'' అంది మొత్తబడుతూ.

"ఏం! లోకం: పాడులోకం: ఒప్పుకోవడమేమిటి? నీపిల్లకి మొగుడులేడు. లోకమేమైనా తెచ్చిఇవ్వగల్దా? ఎదటివాళ్ళలో కాస్త ఏలోపైనా కనబడగానే తాటాకులు కట్టడం - తీరా, తమవిషయం రాగానే ఎవరిమట్టుకువారు సమర్థించుకోవడం, ఎవరెరగరు లెస్తూ! ఇంక శాస్త్రాలంటావా: అవీ హృదయంగలవాళ్ళు రాసినవే. వసిష్టుడు-యాజ్ఞవల్క్యుడు. గౌతముడూ మొదలైన వారంతా ఒప్పుకోనే ఒప్పుకున్నారు. అసలు మనబుద్ధి పెట్టుకు విచారిద్దాం. ఇలాంటి విషయాల్ని తీర్చవలసింది ప్రకృతిగాని సంఘం

కాదు. ఆమాటకొస్తే సంఘానికి హక్కే లేదనాలి. చూడూ: మనచిట్టే ఉందనుకో. దీనికి ఎప్పుడేనా మనసు చలిస్తుందనుకో మాటవరుసకి. ఎందుకు చలించాలి? అది ప్రకృతిలో ఉన్న నైజం. దాన్ని మార్చడానికి నీతరమా? సంఘుంతరమా? మనవాళ్ళు చెప్పేవిధంగా ఆలోచిస్తే అసలు ఇటువంటి ఊహాలే పుట్టకుండా ఉండాలి."

"మొత్తానికి రాజమండ్రీలో ఉన్నందుకు నీకూపట్టుబడింది వీరేశలింగంగారి తత్వం:'' అంది అప్పగారు.

రేకెత్తుతున్న ఆవేశంతో ఆవిడమళ్ళీ ఇలా అంది.

"నీకూ బాగానాటిందంటే, నాకన్నా ఎక్కువే తెలుస్తుంది. నేను విన్నదాన్నిపట్టి చెప్పాను. అలాగే చూస్తూ ఉండు. అభం - శుభం తెలియదుగనుక చిట్టి ఇలాఉంది గాని, వయసొచ్చాక ఈకట్టుతాళ్ళకి ఎంతదుఃఖిస్తుందో ఉసూరుమంటూ."

ఈమాటలన్నీ చిట్టెమ్మతల్లి హృదయంలో అహోరాత్రస్య మెదులుతూనే ఉండేవి. తన కూతురు భావిజీవితం - సౌఖ్యం, వీటినిగురించే ఎప్పుడూ మనసు క్షోభిస్తూ ఉండేది. రానురాను ఈవిచారం జబ్బుగా పరిణమించింది. బెంగ - కళ్ళయెదట కన్నకూతురు ఇలా ఉండడం, కడుపు చెక్కలుగాక ఎలానిలుస్తుంది?

చిట్టెమ్మ ఈవేషంలో ఒకగంట ఏముందో! అంతే. మళ్ళీ ఎప్పటిలాగా బొట్టూ - గిట్టూ చెరిపేసింది. ఇంతవరకు

అదేతొలిసారి- కడసారి కూడాను. తిరిగి అలావేషం సంత రించడానికి ఆతల్లి ఉంటేగా!

ఆమె ప్రాణం విడిచే సమయాన్ని భర్తనిపిల్చి చిట్టెమ్మని ఆయనచేతులో అప్పగిస్తూ "దీనికి అమ్మైనా నాయి నైనా ఇంకమీరే. దీనికి ఏలోటు కనబర్చకండి. మీకుపద్దె యేళ్ళు దగ్గిరదగ్గిరగా వచ్చాయి. మళ్ళీ పెళ్ళిచేసుకోకండి. అమ్మాయి కాచిపోస్తుంది. లేకపోతే ఏవంటలక్కనైనా పెట్టుకోండి. అమ్మాయి సౌఖ్యంమాత్రం మర్చిపోవద్దు." అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకుంది. ఆనీళ్ళతోటే జీవుడు ఎగిరిపోయాడు.

ఆవిడ చనిపోయిన మూడో నెల్లోనే దీక్షితులుగారు పెళ్ళికొడుకయ్యాడు.

మాఘమాసం రానేవచ్చింది. ఆయన శోభనంచేసు కోడానికి గుడివాడ ప్రయాణమయ్యాడు. చిట్టెమ్మకూడా చిన్నతనమవడంచేత వెళ్ళాలనే అనుకుంది. కాని ఆయన తీసుకువెళ్ళందే! కార్యానికి వెడుతూ పిల్లిని చంకబెట్టుకుని వెళ్ళినట్టుగా వెధవకూతురు గూడా ఎందుకనుకున్నాడో ఏమో! బందరులోఉన్న చెల్లెల్ని అలాగుడివాడకిరమ్మని కబురుచేసి, తనూ - పురోహితుడూ ఇక్కడనుంచి బయలు దేరారు.



ఒక సంవత్సరం గడిచింది. దీక్షితులుగారు భార్య అన్నపూర్ణని తీసుకురావడానికి గుడివాడ వెళ్ళాడు. తీరా వెళ్ళేసరికి వినాయక చవితి పండుగ రావడంచేత బావమరదులు ఆయన్ని బలవంతంగా ఆపేశారు.

ఇక్కడ ఇంటికాపలా చిట్టెమ్మ. ఆరోజునంతా ఏమీ తోచిందిగాదు. అన్నంసరిగా రుచించలేదు. ఇరుగు - పొరుగువారంతా ఉండ్రాళ్ళూ - అవీ వండుకున్నారు. చిట్టెమ్మ ఏదో పచ్చిపులుసూ - మెతుకులుతిని తండ్రిగారి రాకకోసం రాత్రంతా జాగారం చేసింది. పైగా తుంటరి కుర్రివాళ్ళు ఇంటిమీద రాళ్ళు విసరడం ఒకటి. దీపంపెద్దదిగాచేసుకుని మంచంమీద అలా కొరివిలాగా కూర్చొనే ఉంది.కన్నుమూస్తే ఫెట్టు. తలుపులమీదా - ఇంటిమీదా ఒక్కొక్కరాయి గుభేలు - గుభేలుమని పడడంతోటే ఆదెబ్బ గుండెకి తగిలినట్టుగా ఉంది.

మరునాడు ఏమీతోచక సుందరమ్మగారి ఇంటికి పెత్తనానికి వెళ్ళినప్పుడు - మాటలవరసని "రాత్రి నిద్ర పట్టలేదనీ - ఒక్కర్తెనీ ఉండలేకపోయాననీ చెప్పింది.

"అయ్యో! పిలవక పోయావుటమ్మా! మాఅబ్బాయిని - మాఅమ్మని పంపిద్దును సాయం" అన్నదావిడ.

"సరే: ఈవేళ పంపండి." అంది చిట్టెమ్మ.

సుందరమ్మగారి పెనిమిటి నరసింహాశర్మగారు బెజవాడలోనే రివిన్యూ ఇనస్పెక్టరు. వారికిద్దరు కొడుకులు - ఒకకూతురూను. పెద్దకొడుకు రామమోహనరావు. అతని తర్వాత రాజామణి. ఆమె ఇప్పుడు కాపురం చేస్తోంది. గుంటూరు అత్తవారూరు. రెండో పిల్లవాడు మూడోఫారం చదువుతున్నాడు.

చిన్నప్పటినుంచి వీళ్ళంతా స్నేహితులే. అందులో చిట్టెమ్మకీ - రాజామణికీ ఉన్న స్నేహం ఇంతా - అంతా కాదు. ఒకరికోసం ఒకళ్లు ప్రాణాలు విడుస్తారు. ఇద్దరి అత్తవారూరూ గుంటూరే. అయితే రాజామణి భర్తతో సుఖిస్తోంది. చిట్టెమ్మ తలచెడి పుట్టింట పడివుంది.

యౌవనం వచ్చాక చిట్టెమ్మా - రామం, మళ్ళీ కల్సుకోలేదు. అదేమిటో ఒకర్ని చూస్తే ఒకరికి చెరుగ్గానూ- కొత్తగానూ ఉండేది. అతను చిట్టెమ్మకంటె నాలుగేళ్ళ పెద్ద.

ఎన్నాళ్ళోఅయి, రామం ఈరోజున చిట్టెమ్మగారింట్లో పడుకోడాని కొచ్చాడు. అతని అమ్మమ్మ - ముసలి పండు, ఆవిడకూడా వచ్చింది. చిట్టెమ్మ ఇరువురికీ పక్కలు వేసి తనపక్క ముసలమ్మ మంచందగ్గరే వేసుకుంది. రామం కాసేపు చదువుకుంటానని అక్కడ డ్రాయిరుమీద ఉన్నలాంతరు తీసుకొని ఒకమూలగా పడకకుర్చీ వేసుకుని

కూర్చున్నాడు. ముసలావిడ ఏదో లోకాభిరామాయణం చెప్పింది. క్రిమేపీ ఆసంభాషణ చిట్టెమ్మ చరిత్రలో లీన మైంది.

రామం అమ్మమ్మ పూర్వకాలపు మనిషి. అమా యకురాలు. ఆమెది వెన్నలాంటి మనసు. చిట్టెమ్మ తన కష్టసుఖాలన్నీ ఆవిడతో వెళ్ళబోసుకుంది. ఆవిడా సాను భూతితో ఊ కొడుతోంది.

ఈపిచ్చా - పాటిల్లో రామం చదువు నిలిచి పోయింది. చదువుతున్నట్టు నటిస్తూ చిట్టెమ్మ చెప్పే కబు ర్లన్నీ మనసుకు పట్టించుకుంటున్నాడు.

ప్రసంగవశాత్తు చిట్టెమ్మ అందిగదా! "ఏమోనండీ అమ్మమ్మగారూ! పెద్దలని మీతో చెబుతున్నాను. ఈ సంగతి మీకడుపులోనేఉంచుకోవాలి. మాఅమ్మ ఇంకా ప్రాణం వుందనగా, మానాన్నని పిల్చి చెప్పింది మళ్లీ పెళ్ళిచేసుకోవద్దని."

"ఏమిటోనమ్మా! మనం చెప్పలేం. ఇంతకూ నీపని అధోగతయింది. అయితేనూ, మనోవర్తే మనా్నా ఇస్తారా! మీఅత్తారు."

"ఒక్కసారే పదివేలు పుచ్చుకున్నాడు మానాన్న. అవి వడ్డీకి వేశాడు. ఎప్పుడో పొలం కొంటాట్ట"

"పోనీలే. బాగానేఉంది."

రామం చదువుకుంటూనే ఉన్నాడుగదా అనేనమ్మ కంతో మెల్లిగా పలికింది చిట్టెమ్మ.

"మీరుకూడా అట్లాగేఅంటారేమిటండీ! పదివేలు కాదు. ఏభై వేలున్నా నాకెందుకు? ఎవరిక్కావాలి. పొలం కొంటాడు. సరే! ఎవరనుభవించాలి. ఇవన్నీ ఎందుకసలు, బతుకే బరువయ్యాక!"

కాని రామం చెవులు దోరబెట్టుకొని వింటూనే ఉన్నాడు.

"ఔనమ్మా! ఔను." అంటూనే ముసలావిడ కళ్లు మూసింది. చిట్టెమ్మ పలకరించి చూసింది. ఆవిడ పలకలేదు. నిద్ర పట్టిందికాబోలని చిట్టెమ్మ ఊరుకుంది.

చిట్టెమ్మ ఏవేవో తవ్వుకొని ఊరికే దుఃఖపడడం మొదలుపెట్టింది. ఆనాడు తల్లిప్రాణోత్క్రమణ సమయంలో చెప్పిన ఆమాట స్మరణకి రాగానే హృదయం పగిలింది. మృత్యుదంష్ట్రల్లో పడుతూ - అనురాగమొలుకుతున్న కళ్ళతో - చిక్కిశల్యమైన బాహువులతో, తనను కావిలించుకొన్నఅప్పటి తల్లిరూపం కళ్ళకి కట్టినట్టుగాఉంది. అప్పుడు తల్లినోటినుంచి వెలువడ్డ ఆమాట "అమ్మాయిసౌఖ్యం మర్చిపోవద్దు" అన్న అమృతవాక్కు చిట్టెమ్మ చెవుల్లో గణగణ మోగుతోంది.

అప్పుడు ఆమాటలో ఉన్న అర్థం ఏమీ తెలియలేదు గాని ఇప్పుడుమాత్రం ప్రతిరక్తనాళంలోనూ దాని సారమే ప్రవహిస్తోంది.

చిట్టెమ్మకి పదిహేనోఏడు వచ్చింది ఏడాదికి వసంతాగమనంరీతిగా. వయసుతోపాటు పెరుగుతున్న విజ్ఞానం - మధురభావనలూ - ఆమె సోగ కనుల్లో తరంగితాలవుతున్నాయి. ఉదయాన్నే విచ్చిన బొండుమల్లెలాగా మెరిసిపోతూఉన్న ఆమె స్నిగ్ధాంగముల్లో ఎంతనిండు - ఎంత ఆనందం - ఎంతసౌకుమార్యం! అయితే ఈఅందం - ఈ జవ్వనం ఎవరికానందం? అడవిలో మల్లెపొద పూచింది. లేదా, మామిడిచెట్టు కాసింది, సముద్రంనిండా ముత్యాలూ - నవరత్నాలూను. ఎందుకు?

చిట్టెమ్మ హృదయంలో తఱంగాలమీద - తఱంగాలుగా ఏవో తెలియరానివీ - తెలుపలేనివీ ఊహాలు. కాని అయితే ఈప్రపంచంలో తనజన్మ వట్టి దుఃఖభాజనంగా ఉందనిమాత్రం అనుకుంటూ ఉంటుంది. అసలు సంగతి ఎరగనే ఎరగదు పాపం.

అయితే అటువంటి నవయౌవనం - చక్కదనం - నిష్క్రియంగా ఇట్లా కాలం పాలుగావలసినవేనా! అని గుండెగల ప్రతిమనిషికీ తట్టకమానదు. గులాబీపూస్తోంది, తనకొరకా - ప్రపంచంకొరకా! మామిడిచెట్టు కాస్తుంది,

ప్రపంచంకోసం గద !- చందమామ వెన్నెల కురుస్తుంది. కాని ఆక్రైతల్యాన్ని - ఆసౌఖ్యాన్ని అది అనుభవిస్తోందా ? లోకం అనుభవిస్తోంది. ఆనందిస్తోంది. అలాగే చిట్టెమ్మ. వయసునీ - సౌందర్యాన్నీ అనుభవించే ప్రణయమూర్తి ప్రకృతిలో ఒకడు పుట్టిఉండాలి. ఆదైవాన్ని తృప్తివరచి - ప్రేమించబడడం - ఆనందించడం చిట్టెమ్మకి జన్మతః ఉన్న హక్కు. కాదని గుండెమీద చేయివేసుకొని చెప్పగలవాడెవడు ? ప్రకృతిని నిరోధించడం మాటలా !

రామం ఎప్పుడు దీపంచిన్నది చేశాడో - ఎప్పుడు పడుకున్నాడో చిట్టెమ్మకి తెలియనే తెలియదు. కాని రామంఇంకా నిదపోలేదు. ఒకసారి తలయెత్తి చూశాడు. చిట్టెమ్మ ఇంకా మెలుకువగానే ఉందని తోచింది. అతనికి కొంతకాకపోతే కొంతైనా చిట్టెమ్మబాధ అవగాహనైంది. తనస్నేహితురాలి హృదయంలో ఇంత ఆవేదన - ఇంత అగ్ని - ఉందా అనుకున్నాడు. అతనికికూడా కళ్ళు చెమ్మగిలాయి. "పలకరిద్దామా" అనిపించింది చిట్టెమ్మని. ఎన్నాళ్ళో అయిందాయెను ఆమెతో పలుకాడి ! వయసులోఉన్న తనబోటి వాడిపుడు, ఒకపడుచుపిల్లని- అందులో వితంతువుని - ఇటువంటి సమయంలో పలకరించడం మర్యాదా ! ఇంతలోనే మెఱుపులాగా ఒక్క ఆలోచన తట్టింది.

"చిట్టెమ్మా ! మంచినీళ్ళెక్కడున్నాయి" అన్నాడు లేచికూర్చుని.

చిట్టెమ్మ లేచి - మంచినీళ్ళచెంబు తీసుకొచ్చి అతని మంచందగ్గర పెట్టి వెళ్ళిపోతోంది. రామానికి పలకరించాలని ఉంది. గుండెగుభేలుమంది. అయినా చిన్ననాటి చదువు ఆధారంచేసుకుని మెల్లిగా "చిట్టెమ్మా" అని పిల్చాడు.

ఆమె ఛటాలున ఆగి వెనక్కి చూసింది.

"మాట" అన్నాడు.

చిట్టెమ్మకి ఏదురుద్దేశంగాని ఆమాటలో తోచలేదు. అతికరుణార్ధ్రంగాఉంది ఆపిలుపు. లేడిపిల్లలాగా బిత్తరి చూపులు చూస్తూ అతనిమంచాన్ని సమీపించింది. ఇప్పుడు రామానికి చిఱుచెమ్మటలు పోసాయి. మాట్లాడడానికి ఎందుచేతనో ధైర్యం చాలకుండావచ్చింది.

"ఇదేమిటి చిట్టెమ్మ ఇలాఉన్నావు. ఇంకా నిద్రపోలేదూ ! కళ్ళువాచినట్లున్నాయి ఎర్రపడి. బుగ్గలమీద ఆనీళ్ళేమిటి" అన్నాడు సన్నయెలుగున, ఎలాగో గొంతుక పెకలించుకొని.

"ఆఁ - ఏమీలేదు." అంటూచిట్టెమ్మ చక్కావెళ్ళి పడుకుంది. మళ్ళీ పిలవడానికి అతనికి సంకోచంతోచింది. చిట్టెమ్మ ఏమనుకుందో తనుపిలవడాన్ని చూసి. అయినా తను పిలవడంకూడా భావ్యంకాదు అనుకున్నాడు. దీనివల్ల తన

యెడల ఆమెకి దురూహకలిగిందేమోననికూడా మనసు పీకులాడింది.

చిట్టెమ్మమట్టుకు చిట్టెమ్మకి తనసంగతి రామం గ్రహించాడే అని సిగ్గుగానూ - భిడియంగానూ ఉంది. కాని అతను చూపినదయ - ప్రేమ మాత్రం తోసివేయ వలసినవా ? మొదటనుంచీ అతని హృదయనైర్మల్యాన్ని బాగా ఎరిగిఉన్నదవడంవల్ల అతని నడతలో ఏమీ అను మానం కనబడలేదు చిట్టెమ్మకి. తనస్థితిచూసి "పాపం" అని మాత్రం అనుకునేవారుంటే అంతేచాలునని ఆమెకోరిక ఎంతసేపూను.

౮

రామం స్వతహాగా మిరపకాయలాంటివాడు. అంటే ధూర్తుడనికాదు. ఈసంఘం - ఈముక్కుతాళ్ళూ చూస్తే అతనికి ఒళ్ళు చిట - చిటలాడేది. గ్రాహ్యతఏర్పడింది మొదలు అతను ఎంతసేపూ ఇప్పుడు అమల్లోఉన్న మూఢ విశ్వాసాలంటే ఏవగించుకొనేవాడు. వాళ్ళఅమ్మ తలవైపున దీపంపెట్టుకొని చదువ్వద్దనేది. ఎందుచేతనంటే "కూడదు - అంతే" అంటూ నొక్కిచెప్పడమేకాని అంతకంటే నచ్చ

చెప్పడం చేతకాదు. దీపం వెనక్కి పెట్టుకొని చదవడం కళ్ళకి మంచిదని ఆరోగ్యవిధులు శాసిస్తున్నాయి. అలా వల్లకాదని తల్లి కూకలెయ్యడంలో అర్థమేమీ కనబడేది కాదతనికి.

భార్యచూస్తూఉండగా భోజనం చెయ్యకూడదనే యాజ్ఞవల్క్యవచనం - సముద్రయానం చెయ్యకూడదన్న వృద్ధపరాశరవాక్యం అర్థంకాకుండా వచ్చాయి.

హేతుపూర్వకంగాని మూఢాచారాలు ఇలాంటివి ఎన్నో కనబడుతూ వచ్చాయి. అవిచూచి నవ్వుకుంటూ ఉండేవాడు. ఇవికాక ఇళ్ళలో ముసలమ్మల చేదస్తాలు మరీ అయోమయంగా ఉంటాయి.

ప్రకృతినికూడా శాసించడానికి దొరకొనే మన పండితుల దౌష్ట్యాన్ని చూసి అతను చాలా వ్యథపడుతూ ఉంటాడు. ఎక్కడేనా శాలువాలవారూ - కుండనాలవారూ కనబడితేసరి ఇంక వారితో వాదనకి దిగేవాడు. తరుచు రైలుప్రయాణాల్లో ఏశాస్త్రిలుగారితోనైనా తగవులాడందే వచ్చేవాడుకాదు.

ఇప్పుడు ఇతనికి ఇంకొక క్రొత్తఆరాటం ఏర్పడింది. ఏమిటంటే ! "చిట్టెమ్మ యౌవనంలోఉంది. ఇంకా చాలా కాలం ఈభూమిమీద మనవలసినదిన్నీ జన్మయెత్తేక అందరికీ వాంఛలు ఉండడం సహజమేకద. పళ్ళూ, కాయలూ

తిని నిర్మాను ష్యమైన ఏకొండకోనల్లోనో - ఏకారడవుల్లోనో తపస్సు చేసుకొనే విశ్వామిత్రునిలాంటివాడు కూడా ఒకప్పుడు కామానికి దాసోహమన్నాడు. విష్ణురూపాయ - శివరూపాయ అని మనం ధ్యానించే వ్యాసులవారికి తండ్రి- సంఘాన్నీ - జాతినీ శాసిస్తూ స్మృతి వ్రాసిన మహాను భావుడు పరాశరుడు కూడా అతివిచరతికి పాలుపడ్డాడాయెను. అంతేకాదు. ముక్కోటిదేవతలకే గురువు బృహస్పతి కథ చూడండి! నిండుచూలాలు - అన్నభార్యఅయినా చూడకుండా, కామాంధుడై ఆమెను రమించాడు. చూశారా! అటువంటి మహామహులకే అలివికానప్పుడు మనకా! పదిమందిలోనూ - తిరుగుతూ - అన్నీచూస్తూ కోరికలు బిగబట్టుకోవాలంటే ఎలాగ? అయినకాడికి పులిహోర - దద్ధోజనం మొదలైన కామోద్దీపకపదార్థాలన్నీ కడుపులో మడతొక్కుకొని పైకి "ఇంద్రియనిగ్రహం - ఇంద్రియనిగ్రహం" అని ఎంత అరుస్తేనూతేం ఏమిలాభం? పైకి మడి కట్టుకున్నామని చెప్పే మన మతగురువుల లోపలికుళ్ళు చూస్తున్నారుగా! ఎన్నివినడంలేదు! దీనికంతా ఏమిటంటారు కారణం! అక్కడికి తామున్మట్టుకు మహానిజాయితీగా ఉన్నట్టు ఏమీ ఎరగని అమాయికపిల్లల గొంతుకులు కోస్తున్నారు.

సృష్టిలో ఏజంతువు - ఏపక్షి మగపోందు లేకుండా ఉంది! చివరకి అచేతనాలయిన వృక్షాదులకిన్నీ పురుషజాతి

అవసరంగా కనబడుతోందే! ఇక మానవులికా ఈఇనప గొలుసులు.

దీక్షితులుగారుమట్టుకు దీక్షితులుగారు తన స్వార్థం చూచుకో లేదూ! మరణశయ్యమీద ఉన్న భార్యచేసిన విన్నపాన్ని గాలికితోసి, తాను తిరిగి వివాహం చేసు న్నాడు. తనకూతురు - పసుపిల్ల శాశ్వతంగా వితంతువై పడిఉండాలిట. ఇదెక్కడిన్యాయం! దీనిఅంతు కనుక్కో వాలి."

రామానికి నిర్భయంగా దీక్షితులుగారితో ఈవిష యాన్నిగురించిన పోట్లాటపెట్టుకోవాలని మనసు ఉరికే ఉరకలు వేస్తోంది. కాని ఎట్లా? వెనక, తండ్రిఉన్నాడు. ఆయన చాందసుడు కాకపోయినా ముల్లు అటే మొగ్గుతుంది. రామానికా అంత స్వాతంత్ర్యంలేదు. ఎలాగీపీకులాట!

చివరకు దీక్షితులుగారు రాగానే ఆయనకి ఆకాశ రామన్న ఉత్తరాలు కొట్టాలని నిశ్చయించుకున్నాడు. ఆయన్నింక నిద్రపోనీయకూడ దనుకున్నాడు. ఎలాగేనా చిట్టెమ్మహృదయ రోదనానికి తనుకూడా భాగస్వామికావా లని దృఢంగా సంకల్పించుకున్నాడు.

రెండు సంవత్సరా లయింది అన్నపూర్ణ కాపురాని కొచ్చి. అన్నపూర్ణ చిట్టెమ్మకంటె పేణ్ణార్థం పెద్ద. ఇద్దరూ కొంచెం హెచ్చుతగ్గుగా ఒక ఈడువాళ్ళే అవడంవల్ల కొన్ని రోజులుదాకా కులాసాగానే నడిచింది. అన్నపూర్ణకి కొత్త

రికం వదలినకొద్దీ తనహక్కు - అధికారం తెలిసిరావడం మొదలుపెట్టాయి. తనుచెప్పినట్లు చిట్టెమ్మ నడవాలి. వంటా - పెట్టూ - పనీ - పాటా అంతా చిట్టెమ్మ చెయ్యాలి. వేళకింత తిని ఏ కేసు కట్టుకోవడమో - ఏ ఊరు మీది ఊసులో అన్నపూర్ణ పని.

దీక్షితులుగారికి పడుచు పెళ్ళాంతో రోజులు బహు ఆనందంగా గడిచిపోతున్నాయి. రోజూ వాడికగా పూల వాడు పూలూ - దవనం - మరువం - అవీ ఇచ్చిపోతు న్నాడు. దీక్షితులుగారే స్వయంగా రిబ్బనూ - జడలో గుచ్చుకొనే పిన్నులూ - వైట్ రోజు సబ్బూ కొనుక్కొ చ్చాడు. పెళ్ళాంకోరికమీద ఒకసారి సినీమాకికూడా వెళ్లాడు. మళ్ళీ "ఇంకొకసారి వెడదామా" అని అన్నపూర్ణ అడు గుతే, "కావలిస్తే బండిచేయించుకుని నువ్వువెళ్లు" అన్నాడు. అసలుకారణం ఇది. సినీమాల్లో ఎక్కువగా కామోద్రేకం కలిగించే కథలే చూపిస్తారనీ - అసభ్యపుచేష్టలు (అంటే కావిలించుకోవడాలు - ముద్దుపెట్టుకోవడాలు) కనబరుస్తా రనీ, అటువంటి ప్రదర్శనాలకి చిట్టెమ్మబోంటి అధీనం తప్పిన పిల్లలు వెళ్ళడం చాలా కొంపమీదకి తెస్తుందనీ ఆయన ఊహ.

భోజనానంతరం చేతులు కడుక్కోవడమే తరవాయిగా గదిలో జేరి తండ్రీ - నవనీతల్లి తాంబూలాలు సేవించడం -

చిట్టెమ్మ అవీ - ఇవీ సర్దుతూ వంటింట్లోనే అణగారిపోవడం మామూలైంది. సావిట్లో చాపమీద తనకర్మాన్ని నిందించు కుంటూ చిట్టెమ్మ పడుకుంటే పక్కగదిలో గుసగుసలూ - నవ్వులూ ఆవిడ హృదయాన్ని రెచ్చగొడుతూండేవి.

దానా - దీనా చిట్టెమ్మకీ - అన్నపూర్ణకీ ఒకర్ని చూస్తే ఒకరు మూతిముడుచుకోవడం - చాటుగా మెటికలు విరుచుకోడవం ఆరంభమయాయి. చిట్టెమ్మ ఏదైనా పని చెబితే అన్నపూర్ణకి కోపం అన్నపూర్ణకి అస్తమానూ "చిన్నినాపొట్టకి శ్రీరామరక్ష" అనుకుంటూ తన సంరక్షణా - తనశృంగారం దిద్దుకోవడంతో సరిపోతోంది. ఇక్కడిచెంబు అక్కడపెట్టడం సుకుమార లక్షణంకాదు. అలుకుగుడ్డ ముట్టుకుంటే చేతులు మకిలైపోతాయి. విస్తళ్ళు కుడితే చేతులు బండబారిపోయి సూదిపట్టడానికి వీలుండదు. చిట్టెమ్మకి ఇదంతాచూస్తే మంట. కాని ఆమె ప్రతిసాయింత్రమూ తలదువ్వుకుని చీరకట్టుకొనేది. "వెధవముండకి ఈ షోకేమిటి!" అనుకొనేది మనసులో అన్నపూర్ణ.

ఓనాడు అన్నపూర్ణ తెప్పించుకున్న పేరిస్ తలనూని ఇవతలుంటే చిట్టెమ్మ రాసుకుంది. దాంతో అన్నపూర్ణకి ఒంటిమీద జెర్రిపాకినట్లుంది.

"ఇందులో నూనె రాసుకున్నావా." అని అడిగింది.

"కొబ్బరినూనె అయిపోయింది. ఎలా ఉంటుందోఅని కాస్త రాసుకున్నాను." అని చిట్టెమ్మ సమాధానం.

"నీలాంటివాళ్లు రాసుకునేదికాదు"

"ఊఁ. దానిమీద ఇంగ్లీషులో రాసిఉన్నది అదేనా"

"ఏమబ్బా! ఈమాత్రందానికే తెలివంతా వ్రెలక పోసుకోవాల్నా!"

"అదేమిటిపిన్నీ! నీకు కోపమొస్తుందనుకో లేదు. నిజంగా తెలియకనే అడిగాను. పోనీలే.

"ఎంతనంగనాచివే"

చిట్టెమ్మకి తనమాటలో తప్పేమీ కనబడలేదు. అన్నపూర్ణకి తననూని రాసుకున్నందుకే ఇంతకష్టంగా ఉందని అనుకుంది.

"తినమరిగినకోడి ఇల్లెక్కి కూసిందిట" అని సణుగుకుంటూ కనుబొమలు ముడేసుకుని చక్కాపోయింది. అన్నపూర్ణ.

## ౬

ఇలా ఉంటూఉండగా దీక్షితులుగారికి ఒకదాని మీద ఒకటిగా మూడు ఆకాశరామన్న ఉత్తరాలొచ్చి పడ్డాయి. వాట్ని చూడడంతోటే ఆయనకి అర్ధికాళ్ళు ఘంట

నెత్తికొచ్చింది. ఎవరో కాడీలు తనసీ - తనకూతుర్నీ అల్లరిపెట్టాలని చేస్తున్నపని అనుకున్నాడు. కానైతే ఆయ ననుకున్నట్టుగా లేవా జాబులు. వితంతువివాహాన్ని బల పరుస్తూ స్మృతి - స్మృతి మధ్యమధ్య రుచి చూపిస్తూ వ్రాసి ఉన్నాయి. "పోకిరీ కుర్రాళ్లైతే ఇలా రాయలేరు. ఎవళ్ళో చదువుకున్నవాళ్ళకొచ్చిన రోగమే ఇది" అని ఆఖరుకి నిశ్చయపరుచుకున్నాడు.

కాని ఆయనహృదయంమట్టుకు రాతిదా ! ఉక్కుదా ! ఎంతఇదైనా తండ్రి. పూర్వాచారానికి ఎక్కడ మచ్చ స్తుందో అని భీష్మించుకుని కూర్చున్నా అంతరాత్మ మాత్రం చిట్టెమ్మకి పెళ్లి చెయ్యడమే న్యాయమని ప్రబోధిస్తోంది.

ఆయన బెజవాడ కంతటికీ పూర్వాచారపరాయ ణులకి మొనగాడు. అనుదినం పదిమంది ఆయనచుట్టూ దీపందగ్గర దోమలు ముసిరినట్టుగా తిరుగుతూ ఉంటారు. రజస్వలానంతర వివాహాలుకూడదని శారదాగారిబిల్లుని ముక్కముక్కలుగా ఖండిస్తూ ఉపన్యసించిన వారిలో ఈయ నొకడు. కాశీలో జరిగిన సనాతనహిందూమహాసభకి ప్రతి నిధిగా వెళ్లాడు. బెజవాడసభకి గౌరవకార్యదర్శి. ఈయనకి పురిపెట్టి ఆడించే ప్రచండుడింకొకాయనున్నాడు. ఆయన అసాధ్యుడు. అస్పృశ్యతా నివారణసంగతి - నూతనసంస్క రణల విషయం ఎత్తుకున్నాడని కర్మయోగి గాంధీగారికే రిజష్టరీనోటీసిచ్చాడాయన. ఒక దేశభక్తుడుకూతురికి పెళ్ళి

చేసుకుంటూవుంటే "మీఅమ్మాయి పెద్దమనిషయిందా! లేదా!" చెప్పమంటూ రిజిష్టరీనోటీసిచ్చాడు. నోటీసుల మీదే కాని అషామాషీవ్యవహారాలు పనికిరావాయన దగ్గర.

ఒక్కొక్కసారి కళ్ళుమూసుకుని నిశ్చలంగా ఆలోచించి చూస్తే చిట్టెమ్మకి పెళ్లిచెయ్యడం అన్నివిధాలా మంచిదని తోస్తూఉండేది. "అథవా చెయ్యకపోతే ఏమో! దాని మనసు సరిగ్గాఉంటుందన్న నమ్మకేమిటి! లోపల - లోపల అత్తింటికీ - పుట్టింటికీ అపకీర్తి తెస్తున్నవాళ్లెంతమంది లేరు. ఈవిషయంలో మళ్లీ - గిళ్లీ ఆగుతుందా!" అనుకునేవాడు మనసులో. అయితే చేతులారా చేసి తన పరపతి చెడగొట్టుకుంటాడా!

రెండేళ్లువెళ్లాయి. ఇంకా ఉత్తరాలు రావడం మానలేదు. అవన్నీ అన్నపూర్ణకంటపడుతూనే ఉన్నాయి. చాటుగా చిట్టెమ్మకూడా చదువుకొంటోనేఉంది. ఈజాబుల వల్ల రెండుపనులు జరుగుతూవచ్చాయి. ఒకటి, చిట్టెమ్మ హృదయంలో మొలకెత్తిన ఆందోళన పెద్దదై మ్రాను కట్టడం - రెండు, దీక్షితులుగారి మనసును గిలకొట్టడమున్నా కాని చివర వ్రాసింది మరీఘాటుగాఉంది.

చిట్టెమ్మకీ - అన్నపూర్ణకీ మనస్పర్ధలూ - కీచులాటలూ నానాటికి పెరిగిపోయాయి. నూరుపిలకలైనా ఒక గుప్పెట్లో ఇముడ్తాయి కాని రెండుకొప్పులు ఇమడవుగా. ఇద్దరిమధ్యా తగువుతీర్చలేక దీక్షితులుగారి మచ్చమాస్తోంది

రోజూ చెవిదగ్గిర జోరీగలాగ "చిట్టెమ్మ నిలబడి నీళ్ళు తాగిందనీ - పడుకుని పాలుతాగిందనీ - కిటికీలోంచి వీధు లోకి తొంగి చూసిందనీ" ఏవేవ్వో పితూరీలు చెబుతూనే ఉంటుంది అన్నపూర్ణ.

ఈచివర ఉత్తరం ముందుగా అన్నపూర్ణ చేతిలో పడింది.

దీక్షితులుగారు సాయింత్రం ఐదుగంటలవేళ దొడ్లో అరటిచెట్లకి బోదెచేస్తూఉండగా వెళ్ళి అన్నపూర్ణ "చూశారా" అంది.

"ఏమిట" న్నారు దీక్షితులుగారు కంగారుగా.

"ఉత్తరం" అంటూ ఆయన చేతికిచ్చింది.

ఆయన చివరదాకా చదువుకుని కళ్లెర్రజేసి "ఏమిటి ఈవెధవ ఉత్తరాలు. అంతూ - పంతూ లేకుండాఉందే! ఎవడురాస్తున్నాడో దుర్మార్గుడు కనబడితే డొక్క వాలికిలు చేద్దును." అని గర్జించాడు.

. "రాస్తారు! రాయరూ! మనదగ్గిర మెత్తన కన బడితే. ఔనులెండి. వాళ్ళతప్పేముంది. తలా - గిలా దువ్వు కుని కింగు - కింగు మంటూ గంగిరెద్దులాగ తిరుగుతూ ఉంటే ఎవడికళ్ళైనా పడతాయి. సిగ్గూ - బిడియం లేక పోతేసరి ఏముంది! అదుపా! ఆజ్ఞా! ఇంట్లో మొగాడు చేతకానివాడయితే" అంటూ అన్నపూర్ణ సూటీ - పోటీగా

మాట్లాడింది. దాంతో ఆయనకి రేచిక్కేసుకొచ్చి "ఏం చేయమంటావు చెప్పు" అన్నాడు.

"ఏమిటి చెయ్యడం. వాడెవడో రాసినట్టు మీకేం హక్కుందని !"

"అదికాదే ! గొంతుకుపిసుక్కు చావమంటావా ఏమిటి ? వెధవగోల - వెధవగోలా అని"

ఆ ఊరుకు చిరాకు హెచ్చినకొద్దీ అన్నపూర్ణ సన్నాయినొక్కులు ఎక్కువయాయి.

"మొగుడు చచ్చినదానికి లేకపోతే ఈ వేషాలేమిటి. ఓమూలపడి ఏడవక. అలామప్పేరూ ! మొదట్నించీని ! అంతాముదిరాక ఇప్పుడు మానాప్పాలంటేమాత్రం ఎవరి ఒల్లవుతుంది. లేతప్పుడే ఒంగనిమొక్క మానుకట్టేక వొంగుతుందా ! అంతా నవ్వడమేకద ! వీధంట పోయే వాళ్ళంతా తొంగి - తొంగి చూడడంగద ! అల్లరికొంపై పోయిందిగద ! మీకేమీ అక్కర్లేదుగద ! అందరూ ఇలాగే ఉంటున్నారా ! మరీని. మొగుడుపోయినవాళ్ళ నెంతమందినో చూశానుగాని, ఇంత అర్ధానం ఎక్కడా లేదు మన నొసట్నే పొద్దు పొడిచినట్టుగాఉంది చూడగా. మామే నత్తకూతురుంది, ఈవిడీడుదే. ఎంతఆచారం - ఎంతఇదీ. చూస్తే ఎంతో ముచ్చటేస్తుంది. రాత్రిళ్ళు ఈవిడకిమల్లే సొష్ట పూర్తిగా అన్నీ తింటుందా ! ఏపిండో - పిసరో తిని

రామా - కృష్ణా అనుకుంటూ కూర్చుంటుంది. ఆవిడ చేసే వ్రతాలో ! ఆ ఉపోసాలు !"

దీక్షితులుగారు మౌనంతో అంతావిని ఊరుకున్నాడు వినగా - వినగా బ్రహ్మా కేనా పుడుతుంది రిమ్మ తెగులు. ఉత్తరం చేత్తో పుచ్చుకుని ఆయనా - వెనకాలే అన్నపూర్ణా ఇంట్లోకొచ్చారు. వీరు వచ్చేసరికే చిట్టెమ్మ తలదువ్వు కుంటోంది. ఎప్పుడూ లేనిది దీక్షితులుగారికి ఒళ్ళు భగ్గు మంది.

"ఒసే చిట్టీ ! చూశావా ! ఈ ఉత్తరాలు. ఎందు కొస్తున్నాయంటూ విలాగ !" అన్నాడు కాగితం ఆవిడ ముందుపడేసి.

చిట్టెమ్మ నిర్ఘాంతపోయింది. ఎక్కడా నెత్తురు చుక్క - అన్నమాట లేదు. బిత్తరిచూపులు చూస్తూ అలాగే కూర్చుంది బొమ్మలాగా. చిట్టెమ్మ చేతిలోంచి దువ్వెన్న జారి సీసామీద పడడం - నూనె ఒలకడం సంభవించింది. "ఒలికిందీ!" అంది అన్నపూర్ణ వెంటనే.

"పోనీ లే.........మాట్లాడవేం ?" అన్నాడాయన చిట్టెమ్మ కేసి చుర - చుర చూస్తూ.

భయపడుతూ చిట్టెమ్మ "నాకేం తెలుసు" అంది. "నాకేం తెలుసా ! భడవకానా ! భడవకానా ! అని చెప్పే వాడంటూం లేకేనా ఈపిచ్చి పిచ్చి వేషాలు ! తనతండ్రైనా

అలా అంటూవున్నది అనుకుంది చిట్టెమ్మ. తెల్లపోయింది. ఏమనిడానికీ భయమేసింది. అయినా ధైర్యం తెచ్చుకుని "అదేమిటినాన్నా! అలా అంటావు." అని మాత్రం అనేసరికి బిక్కపిక్కయమైపోయింది.

"అందుకే, నాకొంప నడిబజార్లో పెట్టావు. ఇంకా సిగ్గులేదూ!" అంటూ రుసరుసలాడి వెళ్ళిపోయాడాయన.

అన్నపూర్ణ సగర్వంగా నవ్వింది.

చిట్టెమ్మకి అతల పాతాళానికి తొక్కినట్లుగా అనిపించింది. కళ్ళనీళ్ళు తిరిగాయి. ఎవరో మీదపడి కొట్టినట్టుగా - ఆపలేకుండా దుఃఖమొచ్చి పడింది.

కొంత సేపటికి ఏడుపు దిగమింగుతూ "మానాన్న ఇలా అంటాడని ఎప్పుడూ అనుకోలేదు." అంది.

"ఏమునాన్నకేమిటి? ఏడుపుకూడా ఎందుకుపైగా." అని అందిపుచ్చుకుంది అన్నపూర్ణ.

"ఏడుపు రాకపోతే ఏముంది!"

"తల దువ్వుకోవద్దన్నా - నగలు పెట్టుకోవద్దన్నా కూడా తప్పే?"

"తలదువ్వుకుని ఏంచేశానని!"

"ఏం చెయ్యాలి. ఇంకా. అడ్డమైన పోకిరీ వెధవల్నీ ఇంటిచుట్టూ తిప్పడం చాల్దూ."

చిట్టెమ్మకి ఈమాటతో నఖ - శిఖ పర్యంతం గజ-గజ లాడిపోయింది. తాచుపాము పిలలాగా చివాలున లేచి

"నీకోసమే వస్తున్నారేమో. నేనేమీ నీకుమల్లే పెడపాపిడి తీసుకొని - చంకల్లోకి రవికలు కుట్టించుకుని సినీమాలకీ - నాటకాలకీ - పచ్చిబోగందానిలాగా - కిరస్తానీ దానిమాదిరిగా షికార్లు బయలుదేరడంలేదు. అక్కడ పరిచయమైన వాళ్ళెవరో నీకోసం వస్తున్నారు గావును."

"ఏమిటీ మళ్ళీ కుయ్యి."

ఈరోజున చిట్టెమ్మ తన నెదిరించి మాట్లాడడం తలకొట్టేసినట్టుగా ఉంది అన్నపూర్ణకి. కందగడ్డలాగా మొఖం చేసుకొని "ఆవస్తువులు కాసిన్ని లాక్కుంటేసరి, ఒదుల్తుంది జలుబు!" అంది.

ఆమాటకి చిట్టెమ్మ ఓరిమిపట్టలేక "ఎవరబ్బసొమ్మూ కాదు. లాక్కోడానికి:" అనేసింది.

ఈ కేకలు విని దీక్షితులుగారు గబగబావచ్చి ఏమిటిది: మాలసంతైపోయింది, బొత్తిగాను. వెధవగోలా: మీరూను." అంటూగదమాయించాడు.

"బాగానేవుంది ! ఎవరేమన్నారని: ఈధూకుడంతా: నామీద రంకుగట్టి మీకూతురు నలుగుర్లోనూ యాగీ చెయ్యొచ్చా ! నేనేమన్నాఅంటే సంతగోలా బాగానేఉంది. బాగానేఉందాని !'' అని అన్నపూర్ణ తుమ్మల్లో పొద్దుగుంకినట్లు మొఖం వేళ్లాడేసుకుని వెళ్ళిపోయింది.

# ౭

ఇంక రామం. అతనిప్పుడు బి. యే. మొదటి సంవత్సరం చదువుతున్నాడు. బెజవాడలో స్కూలుఫైనలు దాకానే ఉండడంచేత వెళ్ళి, రాజమండ్రి కాలేజీలో ప్రవేశించాడు. బెజవాడ వదిలి పెట్టిగా అతను ఈప్రయత్నం మట్టుకు మానలేదు. అక్కడనుంచే ఆకాశరామన్న ఉత్తరాలు జారీచేస్తున్నాడు.

ఏదో పనియుండి మూడురోజులు సెలవుపుచ్చుకుని రామం ఇంటికొచ్చాడు. వచ్చిన మర్నాడు చిట్టెమ్మని చూడాలని వారింటిముందుగా వెళుతూవుంటే, లోపలఏదో గలభాగా ఉన్నట్లు అనుమానమైంది. మాట్లాడకుండా చక్కాపోయి, దాసీపైడిని భోగట్టాచేసి సంగతంతా గ్రహించాడు. పైడితల్లి (పైడిఅసలుపేరు) ని నింపాదిగా బుట్టలో వేసుకుని, రామం దానిద్వారా చిట్టెమ్మ యోగక్షేమాలు తెలుసుకుంటూ ఉంటాడు. వీరిద్దరికీ ప్రణయసంబంధమున్నదని పైడి ఊహ. రామం, చిట్టెమ్మసంగతి అడిగినప్పుడల్లా అది ముసిముసి నవ్వులతో లయగా మాట్లాడుతూవుంటుంది.

మూడోరోజున ఆమెను కలుసుకోవాలని ఎంతో అదుర్దాపడ్డాడు. కాని వీలు చిక్కేటట్లు కనబడలేదు. మిట్టమధ్యాహ్నమప్పుడు పైడిని కలుసుకుని "ఏమే చిట్టెమ్మ ఏంచేస్తోంది." అని అడిగాడు.

"ఇప్పుడే తలకోసుకుంది" అంది లోలోపల నవ్వు కుంటూ పైడి.

"ఏమిటీ! తలకోసుకోవడమేమిటే'' అన్నాడు తెలి యక.

"తలనీలు బాబూ!"

"తలంటుకుందా"

"మరే బాబూ"

"ఓసి నీదుంపతెగా! చంపావూ! అయితే నెమ్మది గా నేను రమ్మన్నానని చెబుతావూ! మాయింటికి !''

"ఇంకా కూడు తిన్నట్టులేదు. చెప్పుతానుగాని, ఆ అమ్మని ఒగ్గేటట్టు లేదు అన్నపూర్ణమ్మగారు."

"దీక్షితులుగారేం చేస్తున్నారు.''

"కునుకుతున్నారు."

"సరే! అయినా చెప్పు. నేను సాయింత్రంబండిలో వెళ్ళిపోతున్నానులే.

ఏలాగైనా కాస్త వ్యవధిచూసుకుని రామంగారి ఇంటికి వెళ్ళాలనే చూసింది చిట్టెమ్మ. కాని అలాంటిసమ యమే అనుకూలించలేదు. "అతనెందుకు రమ్మన్నాడో! అతనిలో చెడ్డఊహ లేమీ లేవుగద!" అనే బెదురు - సం దేహం, ఒకవైపునా, - ఒకవేళ మనమంచికే నేమో: అయినా అలాంటి చెడుతలుస్తే అతని ప్రతిష్టమాత్రే

మేముంది. అబ్బే! అత సలాంటివాడు కాడు." అని మళ్ళీ సమాధానం, ఇలా కొట్టుమిట్లాడి పోయింది ఆరోజంతా - అయితే సిగ్గూ! అదొకపక్కని వేధించుతోంది. ఏలాగైతే నేం! రామాన్ని చూడడం పడేలేదుమొత్తానికి. కానైతే ఇన్నాళ్ళనుంచీ జరుగుతున్న నాటకం - క్రితంనాటి సంగతీ, అతనితో చెప్పేసి హృదయం తేలికచేసుకోవాలని మధ్య మధ్య అనుకొనేది. కాని, తనకూ - అతనికీ ఏమిటి సంబంధం!" అని ఒకటి.

ఆసాయింత్రమే రామం వెళ్ళిపోయినట్టుగా పైడి వల్ల తెలిసింది. ఎందుకో ఆత్మబంధువుడు వదిలి వెళ్ళినట్టుగా గుంజాటన పడింది మనసులో చిట్టెమ్మ.

ఏనాడూ లేనిది తండ్రిగారు ఆరోజున తలదువ్వు కొన్నందుకు అంత ఉగ్రుడయాడు, ఎందుచేతనా అని ఆలోచించడం ప్రారంభించింది.

"తలదువ్వుకోవడం తప్పా? భర్త లేకపోవడానికి - శుభ్రంగా ఉండడానికీ సంబంధమేమిటి? అన్నపూర్ణ ఏమైనా దుష్టపుమాటలు చెప్పిందాన్న మనసు విరిచేసిందా! ఇంతకీ నా బ్రతుకు ఎందుకీకొరకాకుండా పుచ్చింది. నిన్న కాక మొన్న నొచ్చిన అన్నపూర్ణ "తినమరిగిన కోడి ఇల్లెక్కి కూసింది" అంటూ ఎకసెక్కెంగా అంది. కన్నతండ్రి ఇంట్లో చాకిరీచేసి కూడా పిడికెడు మెతుకులికి నోచుకోలేమూ! నేను పైడి

కన్నా తీసిపోయానా! నావదివేలూ లేవూ నాన్నదగ్గిర ఆయనకూడా ఆమెతో ఏకమై నామీద కారాలూ - మిరియాలూ నూర్తూఉన్నాడాయిరి. ఎట్లానాగతి! ఇంతకూ అమ్మ పోబట్టిగదా ఈతిప్పలు. తండ్రిదగ్గిరే ఇలాఉంటే ఎలాగ? నేచేసినతప్పుఏదేనా ఉంటే ఇదికూడదని చెప్పరాదూ! పైగా వస్తువులు లాక్కుంటూనంది. ఏమో అంత పని చెయ్యగలదుకూడాను.” అనుకొని చాలా ఖేదపడింద. ప్రపంచంలో నిస్సహాయనై పోయాను” అనుకుంది. “ఈయమయాతన రోజూ ఆవిడతో పోరు - ఈబానిసత్వం ఇంక అనుభవించలేనుబాబూ!” అని వాపోయింది. అనుకున్న కొద్దిదుఃఖం తరుముకొస్తోంది.

వస్తుతః చిట్టెమ్మ వట్టిఅమాయిక. ఏదో అవమానం దుఃఖం. భరిస్తున్నాననే అనుకుంటుందిగాని, దానికి సరియైన కారణంమాత్రం తెలుసుకోలేక పోతోంది. తను వితంతువైనందుకా! లేక తల్లి లేనిదైనమూలాన్నా! అదీకాకపోతే తండ్రి తిరిగి పెళ్ళిచేసుకోవడంచేతా! సరే! ఈవ్రాతల్ని తరించి తాను సుఖపడడానికి ఏదైనామార్గముందేమో ఇంతవరకు తెలియదామెకు. ఈమధ్య వస్తూవున్న ఉత్తరాల్లో తనకు మళ్ళీ పెళ్ళిచెయ్యడం సర్వవిధాలా శ్రేయమని ఎవరో రాస్తున్నారు. ఆడ్మూసిం. ఈవిషయం ఆలోచించవలసిందేననికూడా అనుకుంది.

"పెళ్ళిచేసుకుంటే ఈకష్టాలన్నీ తీరాయా! సొహం తగ్గింగా భర్తతో కాపురం చేసుకుంటూ ఉంటే రాజామణి లాగా బాగానే ఉండును ఈ ముట్టికాయలుండవు అయ్యో బాబోయ్. ఇంకేమన్నా ఉందా! గొంతుక నులిపి చంపేయ్యరూ. ఈమాట పెదిమదాటితే. కూరలమ్మే గవర్న మారాయి నాలుగు పెళ్ళిళ్లుచేసుకుందని పైడి చెబుతూఉండేది. వాళ్ళకులంలో మారుమనువులున్నాయిట. సరిగా బట్టకట్టుకోలేనివయసులో భర్తపోయినా తిరిగి వివాహం చేసుకోకూడదు. హృదయపూర్వకంగా వరించిన మొగుడుతో సంసారం చేసుకోవడంకూడా తప్పేకావును.

క్రమంగా తరిచినకొద్దీ పునర్వివాహమేతప్ప గత్యంతరం లేదని బాగానాటిపోయింది. "ఈగండకత్తెరలోంచి బయటపడడానికి ఇంతకంటె నీతివంతమైన తెరువింకొకటి లేదనుకుంది. అయితేఎలా?

"ఆడుత్తరాలురాసిన మహానుభావుడెవరో తెలుస్తే బాగుండును. పోయి కాళ్ళమీదపడి నాగతిచూడమనే దాన్ని"

ఒకవారం గిర్రున తిరిగొచ్చేసరికి చిట్టెమ్మ పినతల్లి కామేశ్వరమ్మా - చలపతిరావుగారూ వచ్చారు. ఇంత అకస్మాత్తుగా వచ్చారేమా! అనుకున్నా రంగడూ. కనకదుర్గకి మొక్కు చెల్లించాలని వచ్చామని చెబుతూ చలపతిరావు గారు నెమ్మదిగా "చిట్టెమ్మని రాజమండ్రీ తీసుకువెళ్ళి నెల

రోజులుపాటుఉంచుకుని పంపిస్తామని ప్రస్తావనగా తేల్చాడు.

"తల్లిపోయిన నాటినుంచీ దాన్ని చూస్తే హృదయం తరుక్కు పోతుంది. ఒక్కనిమిషమైనా అది లేకపోతే ఏమీ తోచదు." అంటూ ఒకదానికొకటి అతుకందకుండా, పొంతనపొందకుండా నానుస్తూ చెప్పారు దీక్షితులుగారు.

"అన్నగారూ! మీరలా అంటే ఎలాచెప్పండి తల్లి పోయి నాలుగేళ్ళపైగా అయింది. ఇంతవరకు మాఇంటికి దాన్ని ఒకమారైనా తీసుకెళ్ళలేదు. ఎప్పటికప్పుడు ఇలాగే అశ్రద్ధఅయిపోతోంది. అప్పగారు లేకపోయినందుకు చిట్టి నైనా ఆదరాపకంగా తీసుకెళ్ళి నాలుగురోజు లుంచుకోవా లని మాఆవిడ వేధిస్తూనే ఉంటుంది. నాకూ తెలుసు, దీన్ని ఒదిలి ఉండలేరని." అన్నారు చలపతిరావుగారు.

క్రియకి చిట్టెమ్మని తీసుకువెళ్ళడానికి అంగీకరించి నట్టుగానే సూచించారు దీక్షితులుగారున్నూ. అన్నపూర్ణ మట్టుకు రహస్యంగా [illegible] "ఏమండో! చిట్టెమ్మని కనక రాజమండ్రి పంపటం అంటే, దానిష్టముచ్చినట్టు తిరుగుతుంది. అనేవారూ – చేసేవారూ ఉండరు పైనమీ ఇష్టం." అంటూ [illegible]

చిట్టెమ్మ [illegible] పెళ్ళి ఆపి డతో తనసొదంతా [illegible] లాక్కుం టానని అన్నపూర్ణ [illegible] చెప్తుంది. కామే

శ్వరమ్మకి ఒళ్ళుమండింది. "వాళ్ళపాయ్యకాలం ఇదై పోనూ. మీనాన్నకికూడా ఇదేంరోగం" అంటూ నాలుగు శాప నార్థాలూ పెట్టింది.

చిట్టెమ్మ సవితి[illegible] కృష్ణవేణమ్మ కడుపులో నుంచుని "చిన్ని అన్న[illegible] నువ్వే అమ్మవినాకు. సవితితల్లి తన్నెస్తుంటూ! ఎలాగైనా కన్న కడుపులో పెట్టుకుని ఆదరించావే చిన్ని. సవతిం [illegible] నువేరూగా భావించకు. లేకపోతే [illegible]స్తాను." అని ఆవిడను కావిలించు[illegible]. [illegible]శ్వరమ్మ ఆమెతల హృదయాని కంపించేస్తు[illegible]తల్లి! సిక్కొచ్చిన భయం లేదమ్మా! నేనున్నానుగా" [illegible]చెప్పింది. చల్లని ఆనదీ స్నానకంటె చిట్టెమ్మ [illegible]మాటలతో మరీ చల్లగా అమృతస్నానం అయినట్లయింది.

## ౮

తీరాబయలు దేరేవేళొచ్చింది. చిట్టెమ్మ అన్నపూర్ణతో వెళ్ళొస్తానని చెప్పింది. "మళ్ళీతొరగారా" అంది అనపూర్ణ అనురాగం కనబరుస్తూ. దీక్షితులుగారు రైలెక్కించి వెళ్ళ

డానికి వీరితో వచ్చాడు. బండి బయలుదేర్తోంటే "అమ్మాయీ ఉంటాను" అన్నాడు. ఆమాట నాభిదగ్గిర్నుంచి వచ్చిందవటంవల్ల ఆయనకు కళ్ళనీళ్ళొచ్చాయి. రైలు సాగిపోతూంటే చిట్టెమ్మ వంగి తండ్రిని చూస్తూనేవుంది. ఇద్దరికళ్ళనీళ్లూ చూపుల్నడ్డగించాయి.

తండ్రిని వదిలివచ్చినందుకు ఎంతో బెంగఅనిపించింది చిట్టెమ్మకి.

చలపతిరావుగారు ఏమీతోచక అటూ - ఇటూ చూశాడు. రైలు అఘమేఘాలమీద వెళ్ళిపోతోంది. "నాలుగైదుగంటలు ఎలా వెళ్ళబుచ్చుదామా" అని ఆలోచించాడు. ఇంతలో ఒకఆచార్లుగారు ఎదురుబెంచీమీద కూర్చునివున్నాయన "బాబూ తమరెక్కడదిగుతాడు" అని పలకరించారు. దీంతో "బాతాఖానీ దొరికిందిరా!" అనుకున్నారు చలపతిరావుగారు. కాసేపు ఆసంగతీ - ఈసంగతీ మాట్లాడారు. క్రమేపీ వేదాంతచర్చలోకి దిగింది.ఆక్కణ్ణుంచి ధర్మశాస్త్రాలూ - సంఘనియమాలూ, వచ్చాయి.

మొదట్లో ఆచార్యులుగారి తత్వం కాస్తఅవగాహన చేసుకోవద్దూమరి! ఆయన వైష్ణవమతాచారాల్నితూచా తప్పకుండా అనుష్టిస్తూన్న కర్మిష్టుడు. అందుకు నుదురంతా ఆక్రమించివున్న ఆనామాలే సాక్షులు. అడ్డమాలాలున్న ఇంటిసమీపానికేనా వెళ్ళడు. ఎక్కడికేనా వెళ్ళాలంటే

నిలువుదార్నే కాని, అడ్డదారి తొక్కడు. ఇక బజారువస్తు వులు కొనడం ఫక్కీ చూడండి. వీశడు వంకాయలు కావాలంటే, "ఏమోయ్ ఐదు శేర్లు రాతితో తూచివంకాయలియ్యవోయ్." అంటాడు. అక్కడికీ అర్థంకాకపోతే "రెండుపదలాలు" అంటాడు. పొరపాటునైనా "వీశ" అన్న మాటరాదు. వీశశబ్దంలో ఈశ్వరునిపేరు నిగూఢంగాఉందని ఆయన భయం. ఇలాంటి ఘట్టాలు ఆయన చరిత్రలో కావలిసినన్ని. గోపురంమీద నిలబడి అష్టాక్షరీ మంత్రాన్ని మాలమాదిగలకి కూడా ఎలుగెత్తి చెప్పిన రామానుజుల మతం రానురాను, ఇంతసంకుచితాభిప్రాయాల్తో మలినమై పోయినది. ఏదీ! ఆ ఉదారత!

"చూశారా! శారదాబిల్లంటూ ఒకటి బయలుదేరింది. ఎక్కడచూచినా ఈరోజుల్లో దానిసంగతేగద! సర్కారువారు చివరకు మతవిషయాల్లోకూడా జోక్యం పుచ్చుకుంటున్నారు." అంటూ ఆచార్లుగారు మెల్లిగా కదిపారు. చలపతిరావుగారు ఆయనకి బాగా వేడి పుట్టిందాకా ఊరుకోవాలని ఊరుకున్నాడు.

"విజ్ఞులంతా ఆలోచించి ప్రభుత్వంవారి ఈదురాగతాన్ని ప్రతిఘటించాలి."

"అంటే, ఏవిధంగా"

"అడ్డుతగలడానికా?"

"ఔను."

"మన పెద్దలు అలా చేస్తున్నారు కాదూ!"

"ఔను. ఇంక మీరెందుకండీ! ఈతొందర."

"కాదు. మీఉద్దేశ్యంకూడా కాస్త తెలుసుకుందా మని"

"మీఅభిప్రాయం ముందు సెలవిచ్చారు కారు."

"అందరితోపాటే నేనున్నా."

'సత్యాగ్రహం చేస్తారన్నమాటే"

"అంటే."

"ఏమీలేదు. జయిలుకి వెళ్ళడానికి తయారుగా ఉన్నారనమాట

"బాగా నేఉంది. దీనికిసాయం ఈసాంకర్యంకూడానా"

"మరి ఏవిధంగా ప్రతిఘటించాలని మీఊహ? మీహక్కు మీరు నిలబెట్టుకోడానికి శక్తిలేదు. పోనీ సత్యాగ్రహంచేసి సాధించడానికా ఆత్మబలం తక్కువ. ఇంక ఎలాగండీ!" దాంతో ఆచార్యులుగారు కొంచెం ఆవేశం తెచ్చుకని "నిరీశ్వరవాదులూ - వర్ణభ్రష్టులూ దిప్పకాయలూ, కొంతమంది బయలుదేరారీమధ్య. వాళ్ళ ఉద్దేశ్యం ఏమిటంటే! మాబోంటి వాళ్ళనికూడా ఎలాగేనా పాడుచెయ్యాలని చూస్తూన్నారు." అంటూ ఇంకా ఏమేమో ఖద్దరుగుడ్డలు కట్టుకునేవాళ్ళనీ - ఇంకా బ్రహ్మ

సమాజం - ఆర్యసమాజం మొదలైన వాటిల్లో తిరిగే వాళ్ళనీ, లుంగచుట్టి అనేశారు.

చలపతిరావుగారికి కొద్దిగా ఇప్పటికి నాటింది. ఇంక ఆట్టే ముదరనియ్యకూడదనుకున్నాడు.

"అయితేనూ ఆచార్యులుగారూ! మీరు పెద్దలు. తమకు తెలియనిదంటూ ఉండదని నానమ్మకం. నేనొక్కటి చెబుతాను. వింటారా! బలవంతాన మీనోట్లో మాంసం కుక్కుతాననుకోండి. ఏంచేస్తారు? పశుబలానికి లొంగిపోయి మీధర్మాన్ని - మీప్రతిజ్ఞని చంపుకుంటారా! లేక దాని కోసం ప్రాణమేనా త్యజించి మీవాక్కును మీరు నిలబెట్టు కుంటారా! చెప్పండి ఇది పెద్దపరీక్ష. మీకు ఆత్మశక్తి ఎంతఉందో దీంట్లో తెలుస్తుంది."

"అందుకని చావమంటారూ."

"ఆఁ, కాకపోతే. పాతివ్రత్యాన్ని సంరక్షించుకో డానికి శక్తి చాలనప్పుడు ఎంతమంది అగ్నిలో దూకి మానాన్ని నిలబెట్టుకున్నారు కారుపూర్వం? ఆలోచించండి. ప్రహ్లాదుని తత్వం సెలవియ్యండిమీరేను. ఇప్పుడు పిరికి తనం - పిరికివేదాంతం ఎక్కువగా అలవడి, మనం ఎందుకూ కొరగాకుండాపోయాంగాని, పూర్వం మనవాళ్లు ఇలాగే చేశారా! ఇంతేగాని చూడండి! రుద్రయాగం చేసినా- ఏంచేసినా, ఏమీలాభంలేదు. దేశాన్ని అధోగతికి తీసుకొచ్చి

పత్రిజల్ని నిర్వీర్యుల్నిగా చేసింది పూర్వాచారపరాయణులే సందేహంలేదు. శాసనంపర్వరించి ప్రజల్లో సంస్కారం కలగ జేయడం నామతంకాదు. కాని సంస్కారం అవుసరమే. నెలల్లో గుడ్డులకే ముళ్లెట్టి పన్నెండేళ్ళకే సంతానాన్ని కనడం నాగరికత అనుకుంటున్నారా! పూర్వాచారం - పూర్వాచారం అనుకొంటారుగాని, అది పూర్వాచారంకాదు. మూఢాచారం. ఏదీ బ్రాహ్మణయుగంలో అతిబాల్య వివాహాలున్నాయని ఋజువుచేయగలరా. చాలాకాలంనుంచి ఈవాదనలుండనేఉన్నాయి. కాబట్టిన కుందేటికి మూడే కాళ్ళని మీవాదన మీరు మాన లేదు." అంటూ చలపతి రావుగారు రైలుహారును మించేటట్టుగా అతిబాల్యవివాహాల్ని - నిర్భంధవైదవ్యాన్నీ ఖండిస్తూ ఆవేశంతో రెండు గంటలసేపు వాదించాడు. పాపం ఆచార్యులుగారు గుక్క తిప్పుకో లేకపోయూరు.

చిట్టెమ్మ అంతా వింటూనే ఉంది. ఆచార్యులుగారి వాదనకంటె చలపతిరావుగారి వాదన హేతుపూర్వకంగాను న్యాయసమ్మతంగానూ ఉందని తోచిందామెకి. పూర్వాచారపరాయణులను కొనేవారికి హృదయం అంటూఉన్నదా అనిపించింది.

# ౭

గోదావరిస్టేషన్లో దిగి బండిచేయించుకుని ఇంటికొచ్చేశారు. చలపతిరావుగారు మధ్యదార్లో దిగి, కూరా-నారా పట్టుకురావడానికి బజారు దారి తీశారు. బండి ఇంటిదగ్గర కొచ్చేసరికి అలాసంచు పట్టి ఆయనా చేరుకున్నారు. వెంటనే కామేశ్వరమ్మ కంఠస్నానం చేసి పొడికట్టుకుంది. చిట్టెమ్మ కూరగాయలు తరుగుతూ ప్రయాణకష్టం - సుఖం చెబుతోంది. చలపతిరావుగారు చుట్ట కాల్చుకుంటూ గడపలో కూర్చుని అన్నీ వింటున్నారు.

"చూశారా! ఆయనకెలా చేతులొచ్చాయోను, మనుషులు ముక్కుపుడకలూకూడా లాక్కున్నట్టు దయా దాక్షిణ్యాలున్నవాళ్ళైతే తల్లిలేని పిల్లగదా, అన్నివిధాలా ఇది ఇలాపడుస్తూఉంటే ఇలాచేస్తాడా!" అంది కామేశ్వరమ్మ ఎసట్లోబియ్యం పోస్తూ "ఎంతచెడ్డా తండ్రిగదా! చేస్తే చెయ్యనూచేస్తాడు. ఆయన కష్టేమిటి!" అన్నారు చలపతి రావుగారు.

"కాదు. ఇంక దీనిగతేమిటంట."

"ఏముంది. పెళ్ళిచేసెయ్యడమే."

"అమ్మబాబోయి, ఆయన బతకనిస్తాడాఇంక"

"ఏమైనాతప్పదు. ఆయన పిలక పీక్కున్నాఅంతే.

అయినాపని కాకతప్పదు. పోదూ, ఆయనమట్టుకు ఏమంత నిజాయితీగా అఘోరించాడు లెద్దూ!"

"ఆయనకేమిటి మొగరాజు."

"ఇది ఆడరాణి. ఏమిటి, పిచ్చిచాదస్తాలు. నేను ఇదివరకే చెప్పాను."

"చేస్తే బాగానేఉంటుంది. పిల్లిష్టమేమిటో" అంటూ చిట్టెమ్మవేపు చూసింది. చిట్టెమ్మముఖంలో పొరలుగట్టి లజ్జా - వికాసమూ కనపడుతున్నాయి.

"సరే ఆలోచిస్తాం. మీరు స్నానంచెయ్యండి" అంది కామేశ్వరమ్మ చిరునవ్వు మింగుతూ.

భోజనాలయ్యాక మళ్ళీ ముగ్గురూ గదిలో సమావేశమయ్యారు. చలపతిరావుగారు మంచంమీద వెల్లకిలాపడుకుని దీర్ఘంగా ఆలోచిస్తూ, మధ్యమధ్య కామేశ్వరమ్మ చెప్పే వాటికి ఊకొడుతున్నాడు. కామేశ్వరమ్మ మంచం తలాపు దిక్కునఉన్న కావిడపెట్టెమీద కూర్చుంది. చిట్టెమ్మ ఆవిడ పక్కనే సిగ్గుతో కూర్చుంది. కామేశ్వరమ్మ అంటుంది.

"ఇంతవరకు మన చుట్టాల్లో వితంతూద్వాహం చేసిన వాళ్ళెవరూ కనబడరు."

"ఔను."

"ఎలాగైనా, ఇదే కొత్తగనక భయంగానే ఉంటుంది."

"అలాగే."

"మాఅక్కయ్యకికూడా ఈఅభిప్రాయం ఉన్నట్టే తోచిందినాకు. అది పాపం ఈబెంగతో చేపోయింది."

"ఊఁ!"

"ఏం! ఊఁ!, గాతలకాయడూ, ఆఁ నిద్రొస్తోందా ఏమిటే!"

"అబ్బే లేదు. ఇదే యోచిస్తున్నాను." అని గభాలున బోరగిలతిరిగి, మోచేతులమీద ఆనుకుని, చలపతిరావుగారు అడిగారు.

"అయితేనూ, ఆబుల్లాడెవరే!"

"ఏబుల్లాడు"

"అతనే, ఆరోజున మనకీసంగతులన్నీ చెప్పలేదూ, బెజవాడేట."

"అతనా, మంచివాడేపాపం. ఏమే అమ్మాయి! ఆ అబ్బాయి ఎవరే"

"మాఇంటిప్రక్కనున్న ఇల్లు తెలుసా సుందరమ్మగారి కొడుకు. ఈడూళ్లో బి. యే. చదువుతున్నాడు. చిన్నప్పుడు మేమంతా ఆడుకొనేవాళ్ళం." అనిన్నీ - అతనికి తనపైగల అభిమానం అదీ అంతా చెప్పింది చిట్టెమ్మ.

"అయితే, చిట్టీ! అతనికి పెళ్ళయిందీ!"

చిట్టెమ్మకి ఈప్రశ్నతో హృదయం కదలినట్లైంది. సన్నని కంఠంతో "లేదు" అంది.

చిట్టెమ్మకోమలహృదయంలో ఈనాటి పినతల్లీ పిన తండ్రిల సంభాషణంతా కల్లోలం కలగజేసింది. ఇదివరకే, నిశ్చలమైన ఆమె మానససరస్సులో ఒకటిమీద ఒకటి ఎన్నోరాళ్ళు పడి అలలు బయలుదేరి, సరస్సుఅంతా వ్యాపించి కలతపెట్టాయి. అప్పటినుంచీ వింతైన భావాలు రేగడం మొదలుపెట్టాయి. యౌవనప్రాదుర్భావంయొక్క అర్థం - వినియోగం, ఇప్పుడు మనసులో ఈటెల్లాగా గుచ్చుకొంటున్నాయి. ఈకొత్తఊహాలన్నీ ఆనందం కలగజేయడానికి బదులు విషాదాన్నీ - నిస్పృహానీ - నిరాశనీ ఉద్దీపన చేస్తున్నాయి. గువ్వలజంటలాగా ఈడూ - జోడూ అయిన నాథులతో తన సహచారిణులు ఆనందిస్తూఉంటే చూడగా ఈమెకు అసూయగా ఉండేది. "ఈకలతపడ్డ మనసు కుదుట పడుతుందా! ఈహృదయతాపం తీరుతుందా" అనే వ్యాకులంగాఉంది చిట్టెమ్మకిప్పుడు.

తిరిగి ఇంకొక ఆందోళన బయలుదేరింది ఆమె మనసులో. సూర్యదర్శనంకావడంతోటే మంచుతెరదానంతటదే తొలగిపోయినట్లుగా ఇన్నాళ్ళనుంచీ ఉన్నకష్టాలన్నీ రామాన్ని తల్చుకుంటే పటాపంచలై పోతున్నాయి. భావ తరంగాలు ఒకటిమీద ఒకటి తరుముకొస్తున్నాయి. అద్దం

లాంటి ఆమెహృదయంలో తేజోమూర్తిఅయిన రామం భావరూపం అంకితమయింది. కాలప్రవాహంలో దిక్కూ - మొక్కూ లేకుండా కొట్టుకుబోయే తనజీవితాన్ని ఒడ్డుకు చేర్చడానికి ఆహృదయాధిష్ఠానదేవతని స్తోత్రంచెయ్యడం మొదలుపెట్టింది ఎటుచూసినా, చిట్టెమ్మకి వివాహం చేసుకోవడమే గత్యంతరంగా తోచింది. ఔను, శరీరాలు వేరైనా హృదయాలు ఒకటిచేసుకొని దైవసాక్షిగా చేసుకొన్న మగనితో గృహలక్ష్మికావడం - అతనిప్రేమలో లీనమైపోవడంకంటె స్త్రీకి కావలిసిందేముంది !

"అయితే ఎవరుచేసుకొంటారు ! చేసుకొని నన్ను సుఖపెడతారు. రామం చేసుకోకూడదూ ! అతనికీ పెళ్ళి కాలేదామెను. అమ్మో ! వాళ్ళవాళ్ళు ఊరుకొంటారా ! వాళ్ళకి ఘుడిసేవాడుకాడే రామం ! సంఘాన్ని దద్దరింపజేసేటంతఆవేశం - కార్యదీక్షా అతనిలో లేకపోలేదు."

క్రమంగా చిట్టెమ్మహృదయంలో కాపురంచెయ్యడం మొదలుపెట్టాడు రామం. ఆమె పూర్తిగా మారిపోయింది కళ్ళు ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూనేఉండేవి. చిట్టెమ్మ ఒక్కసారిగా ఆశావీధుల్లో చక్రాన్ని తిప్పేసింది. భావిజీవితంలో ఎన్నోసౌధాలు - పుష్పవనాలు నిర్మించుకొంది.

మర్నాడు సూర్యాస్తమయసమయంలో చలపతి రావుగారు స్వయంగా హాస్టలుకు వెళ్ళి రామాన్ని పిల్చు కొచ్చాడు. అతను చిట్టెమ్మ రాజమహేంద్రవరం వచ్చాక ఇదేచూడడం.

చలపతిరావుగారు – రామం సావిట్లో కూర్చుని మాట్లాడుతున్నారు. ఎదురుగా గదిలో చిట్టెమ్మ ఒక్కతే ఉంది. కామేశ్వరమ్మ ఎందుచేతనో ఆచాయనే లేదు. రామాన్ని చూడడంతోటే చిట్టెమ్మకి పులకలు గలిగాయి. అంతరాత్మ ఏదో గుసగుసలు ప్రారంభించింది.

చలపతిరావుగారు మెల్లిగా మాటలసందట్లో రామాన్ని సంబోధిస్తూ చిట్టెమ్మని వివాహమాడవలసిందని చెప్పారు. అతను తెల్లబోయి ఇదేమిటనుకున్నాడు.

“గాభరాపడకు. సంఘాన్నితల్చుకుంటే భయంగా ఉందా” అన్నారు చలపతిరావుగారు.

“లేదండి”

“లేకపోతే నువ్వు వేరేఆలోచించవలసినపని లేదు. చిన్నప్పటినుంచీకూడా మీరిద్దరూ జీవికాజీవులుగాఉండి ఒకరి అభ్యుదయాన్ని ఒకరు కోరుతూవచ్చారు. అన్నివిధాలా నువ్వే ఆమెను ఉద్ధరించాలి. కాకపోయినా నీకు తెలుసునో లేదో ఆమె నిన్ను మనసా ప్రేమించింది.”

“అయోమయంగా ఉంది. ఏమీ చెప్పలేకుండా ఉన్నాను.”

"అది సహజమే. కాని, ఆభారం నీమీదేఉంది. సంఘదుర్నయానికి గురియై తపిస్తున్న ఓబాలికకోసం నీలాంటి విద్యావంతుడు తప్పకుండా త్యాగం చూపించాలి. నువ్వు అట్లా ఏనాడు చేయలేకపోతావో, ఆనాడు ఒకప్రాణి నీ కోసం పరితపిస్తూ చచ్చేవరకు దీనంగా పడిఉంటుందని తెలుసుకో. ఆలోచించు."

"కొంచెం ఆలోచించడానికి అవకాశ మివ్వించాలండి. ఎందుచేతనంటే, మొదటినుంచీ సోదరుడనై ఆమె కష్టాల్లో భాగం పంచుకొని, నాచేతనైన సహాయం చేయడానికి నడుంకట్టుకొన్నాను. ఇప్పుడు సౌభ్రాతృత్వం ఇలా మలినమవుతోందేమో అని ఆలోచిస్తున్నా."

"సౌభ్రాతృత్వంకంటె మించిన భాగమే నీకు లభించిందిప్పుడు. అదిగాక ఆభారంనీవే వహించి నీభుజాలతో నువ్వు చిట్టెమ్మని కాపాడుకోవాలి."

"ఆమెకోసం, నేను మృత్యుముఖంలో తలదూర్చమన్నా జంకను. ఆమె దుస్థితి నాఎముక ఎముకకీ - పూర్తిగా పట్టిపోయింది. అయితే మనవిచేయగా, పాత్రమార్చడం విషయమే నాఅంతరాత్మ సుతలాసూ ఒప్పుకోవటంలేదు. సోదరి అని ప్రేమించిన యువతిని అర్ధాంగిగా ఎలా స్వీకరించగలనా అనేదే ఇప్పుడు పట్టుకున్న ధర్మసందేహం"

"ఆసందేహం ఆలోచిస్తే నీకే విడిపోతుంది. కాని, నువ్వు రోజూ తప్పక మాయింటి కొకపర్యాయం వచ్చి

పోతూ ఉండాలి. తిరస్కరించకు.'' అంటూనే చలపతిరావుగారు లోపలికి ఎందుకో లేచిచక్కా వెళ్ళారు.

రామం ఒక్కడే కూర్చొని, ఒకనిముషం ఆలోచించాడు. ఎదురుగా చిట్టెమ్మ కనిపించింది అతనికే చూడ్డానికి సిగ్గయింది. ఆమె మనోహరమాగ్ధ్యతంశదృష్టులు వెన్నెల పులుగులు అతని ముఖారవిందమధువునే గ్రోలుతున్నట్టు గ్రహించాడు అతనికి తెలియకుండానే మందహాసం అతని పెదవులమీద నటించింది. సిగ్గుతో చిట్టెమ్మ తలవాల్చింది. ఆమెమో కూడా ఆచిరునవ్వు ఫలించింది. ఇక అక్కడనుంచి ఆమె నతను ఓరకంటితో చూడడమూ — ఆమె అతన్ని ఓరకంటచూడడమూ సాగించారు. ఆచూపుల వల్ల ఇద్దరికీ అవ్యక్తానందం కలిగింది.

కాస్సేపటికి చలపతిరావుగారు లోపలినుంచొచ్చారు కామేశ్వరమ్మకూడా వచ్చి, ఇద్దరికీ చెరో ప్లేటులోనూ, అప్పుడే తానువండిన పకోడీలు ముందు పెట్టింది.

“అబ్బే నాకు వద్దండి” అన్నాడు రామం.

“ఫరవాలేదు. మొగమోటపడకోయ్” అన్నారు చలపతిరావుగారు.

ఇద్దరూ నెమ్మదిగా ఫలహారం చేస్తున్నారు. కామేశ్వరమ్మ గుమ్మంలో నిలబడిఉంది.

"అంతా చెప్పేశాను. ఆలోచించి చెబుతానన్నాడు." అన్నాడు చలపతిరావుగారు భార్యవైపుచూసి, పకోడీలు నములుతూ.

"అప్పుడే అడిగారూ" అంది కామేశ్వరమ్మ నవ్వుతూ చలపతిరావుగారు. "ఏమేవ్! చిట్టీ! రామంవచ్చాడు చూశావా" అని పిల్చాగు.

చిట్టెమ్మ హంసగమనంతో వచ్చి సవినయంగా కొంచెం దూరంలో పిసటల్లిపరిక్ట కాలివేళ్లు చూసు కుంటూ నిలబడింది.

"అమ్మాయీ! నీ ఫలాపు రామంతో -ఊదేశాను.

చిట్టెమ్మ మొగం సిగ్గుతో గులాబిపువ్వులా కించిదరుణ మైనది. తలవంచుకొని మెల్లిమెల్లిగా గదిలోకి నడిచింది. ఈమాగ్ద్యం రామం హృదయాన్ని మరింత వ్యామోహ పెట్టింది.

"ఏమిటండీ అలా బెదరకొడతారు. బాగానేఉంది లెస్తురూ" అంది కామేశ్వరమ్మ.

# ౧౦

రామం హాస్టలుకి వెళ్ళుతూ, రోడ్డుపొడుగునా ఇదే ఆలోచన. ఏమిచెయ్యడానికీ తోచకుండా వచ్చింది.

దైవఘటనవల్ల గాలికి కొట్టుకువచ్చి తన పాదాల ముందు పడినపువ్వులాగా, ఆమె తన జీవితంలో ప్రవేశించడానికి తలపెట్టింది. కాదని త్రోసివెయ్యడానికి మనసెలా ఒప్పుతుంది! అంగీకరిస్తే ఎలాఉంటుందో.

"ఎలా ఉంటుంది. కేవలం స్వర్గానికి దారి చూపించగలిగే ఆనందస్వరూపిణి - చిట్టెమ్మతో నాజన్మ ఎందుకు పవిత్రం చేసుకోకూడదు! ఇక, మనవాళ్ళు నాలుకలు పీక్కుంటారగా! నాకేం భయం: నా అంతరాత్మ ప్రబోధించునట్లు నేను చెయ్యాలి. నా బాగోగులు - సుఖదుఃఖాలు నావే. భార్యవల్ల ఆనందించేది - సుఖపడేది నేను. ఆమరణాంతమూ పాలు - నీరులా కలిసి జీవితాన్ని ఆనందపథాల్లో నడపవలసినది నేనుగాని నాతలిదండ్రులు గారు. ముద్దుముచ్చటలనీ - పూర్వాచారమనీ, అజ్ఞానావస్థలో, వివాహం పేరిట పిల్లలగొంతులు కోస్తున్నారు. ఔను. చిట్టెమ్మ దుఃఖమయజీవితాన్ని ఆనందమయంగా మార్చాలంటే నేను పెళ్ళిచేసుకోవాలి. వాళ్ళూ - వీళ్ళూ అనుకుంటారని నాకెందుకో భయం, తెలియకుండావుంది. ఇది నాపిధి. ఇక, చిట్టెమ్మ

విధవఅంటారు. విధవఅనగా ఏమిటి! భర్తలేనిది అనా! భర్తఉంటే, సువాసినికాదూ. వైధవ్యం వచ్చినదంటే కామంపోయిందన్నమాట, అన్నట్టుగా ఎందుకుండకూడదు? బొట్టు చెరిపేసినంతమాత్రంచేత విధవఎలాఅయింది ? ఛీ! ఇవి ఆధారంలేనిమాటలు."

తరిచినకొద్ది రామూనికి చిట్టెమ్మని వివాహంచేసుకోవాలనే నిశ్చయం దృఢమైపోతోంది. చిట్టెమ్మ అతన్ని ప్రేమపాశాల్తో బంధిస్తోందని తెలుసుకొన్నారు. అతనూ ఆమె బంధనానికి ఆసిస్తూనే ఉన్నాడు. మనోజ్ఞమైన ఆమె వాలుకన్నులు అతని హృదయంలోకి చూపులు బరుపుతున్నాయి. ఆమె కనుల్లో విపరీతమైన దాహంఉన్నట్టు ఇప్పుడు రామం గ్రహించగలిగాడు. ఒకవెంప రామూనికి తండ్రిమీదగలభక్తి - అనురాగం - గౌరవం జ్ఞాపకాని కొచ్చి హృదయాన్ని క్షోభపెట్టడం - ఒకవైపునచిట్టెమ్మని వదుల్తే పిరికితనమూ - అధర్మమూ అనేభయం, ఈవిధంగా సంధిగ్ధావస్థలో పడ్డాడు.

చిట్టెమ్మ అతనికళ్ళల్లో అలా నిల్చిపోయింది. ఆమెను అర్ధాంగిగా స్వీకరించేతలంపు దృఢపడినకొలది, అతనికి ఆమె మీద ఎక్కడలేని మోహమూ - ప్రణయము ఎక్కువ కావడం మొదలుపెట్టాయి. ఇప్పుడు చిట్టెమ్మకి పదిహేనో ఏడు దాటుతోంది. ఆమె సర్వాంగాలూ సౌకుమార్య

సీమలై సొంపుమీరి మిసమిసలాడిపోతూ యౌవనప్రాగల్భ్యాన్ని తెలుపుతున్నాయి. సోగలై చకోరపక్షుల్లావంపులు తిరిగి అందాలు కురిసే ఆమె కన్నుల్లో విద్యావినయాల చేత ఏర్పడిన తేజస్సూ - ఆనందం ప్రస్ఫుటమౌతున్నాయి.

ఆ రాత్రిఅంతా అతను సుఖమధుర స్వప్నాలుకంటూ బ్రహ్మలోకంవరకు పులకితుడైనాడు. చలపతిరావుగారు చెప్పినప్పుడు "సరే" నని అంగీకారమెందుకు తెలుపలేదా! అని చింతించాడు. ఉదయాన్నే చలపతిరావుగారిని కలుసుకొని, తనఒప్పుదల చెప్పాలనుకొన్నాడు. సాయింత్రం కాలేజీనుంచి తిరిగివచ్చేవరకు అతనికి ఈమధుర భావనలకి తీరికే లేకపోయింది.

పొద్దు వాటారుతోంది. శరత్కాలపుటెండ చల్లవడి మల్లెపూల ధావళ్యంతో కలిసిపోయింది. గ్రామం వాహ్యాళికి వెళ్లొస్తానని స్నేహితులుతో చెప్పి గోదావరిగట్టునే కొంత నడిచి, తిన్నగా చలపతిరావుగారి ఇంటికి దారి తీశాడు. ఉద్విక్తహృదయంతో - ఆశాపూరితలోచనాల్తో, ప్రణయదేవతారాధనికి భక్తుడులా చలపతిరావుగారింటికొచ్చాడతను సమయానికాయన ఇంటిదగ్గర లేరు. తలుపు తీసిఉంటే నెమ్మదిగా లోపలికివెళ్ళిచూశాడు. పుంజీభూతసౌందర్యంగా చిట్టెమ్మ ఉయ్యాలబల్లమీద ఊగుతూ కనబడింది. నిలబడిపోయాడు. ఇతన్ని చూడడంతోటే చిట్టెమ్మ తొందరగా

క్రిందకి దుమికి, పండువెన్నెల్లో మిలమిలలాడే సరసీ తరగల మాదిరి పొరలు లేచి, సొగసుమీరిన వెలిచీరపైట సర్దుకుంటూ లోపలికి వెళ్ళిపోతోంది. వినయముట్టిపడేటట్టు "చలపతి రావుగారు లేరూ!'' అన్నాడు రామం. ఆగి, చిట్టెమ్మ "లేరు ఆపీసునుంచి ఇంకారాలేదు.'' అంది మృదుస్వరాన్ని. పెదిమలమీదనుంచి కన్నెనవ్వు తొంగిచూస్తోంది.

"అయితే మళ్ళీవస్తాను.'' అంటూ గిరుక్కునతిరిగి సింహద్వారంవరకు వచ్చాడు రామం.

"వెడతారేఁ! కూర్చోండి'' అంది చిట్టెమ్మ సవినయంగా.

మంత్రబద్ధుడుమాదిరి నిలచిపోయాడు. "మీపిన్నిగారేరి" అన్నాడు కళ్ళెత్తి ఆమెవైపుచూస్తూ.

"పేరంటానికి వెళ్ళింది, ఆర్యాపురం. ఇంకోగంటకి గాని రాదు.'' తరంగితమైన యౌవనాశతో ఆవిడకళ్లు అతన్నిచూస్తూ నిశ్చలంగాఉన్నాయి.

ఒకరికోసం ఒకళ్ళుకలుసుకొనేవరకూ తహతహలాడి పోతూ జంకుకొంకులు లేకుండా నిర్మలంగా "నువ్వు - నువ్వు" అని మాట్లాడేవారు ఇప్పుడు ఎడఎడంగా ఉండి మాట్లాడడానికే సిగ్గుపడడం ఏమిటి ఈమార్పు "మీరు - అండి'' అనడం చిట్టెమ్మ ఆశ్చర్యంతోచింది రామానికి. "ఇంతలో ఇదేమిటి'' అనుకొన్నాడు మనసులో. ఇదివరకు సౌభ్రాత్రం

ఇప్పుడు పూర్తిగా ఇంకొకతరహాఆయెను. పరిణయినీ - ప్రణయాలు. ఈమార్పు సహజమే. మాట్లాడడానికి ఎక్కడలేని బెరుకూతోచింది రామానికి. చిట్టెమ్మ మొఖంమీాద అసలే సిగ్గు తెరవాలింది. ఇద్దరిపెదవులూ కదలడంలేదు. అయితే ఒండొరుల హృదయాలు మౌనంగా మాట్లాడుకొంటూనే యున్నాయి. మధ్యమధ్య రామం చూపుల్లో ప్రేమ కురిపిస్తున్నాడు. తనయెడల అతనంత ప్రేమచలితుడని తెలుసుకోగానే చిట్టెమ్మ నేత్రాల్లో ఒకవిధమైన సంచలనం కలిగింది. రామం ప్రేమోద్వేగి. అతనిలో ప్రేమప్రవాహం కట్టలు తెగిపోతోంది.

చిట్టెమ్మ తరుణహృదయంలో దైవికంగా నాటుకొన్న ప్రేమవల్లి మారాకుతొడిగింది. కుసుమితఅయి పరిణయసౌరభాన్ని వెదజల్లడానికి ఎంతకాలమో పట్టదు.

అలానిశ్శబ్దంగా లజ్జతో ఇంకకూర్చోలేకపోయాడు రామం. అదిగాక మబ్బుపట్టి ఆరుగంటలకే చీకట్లు ముసురుకొస్తున్నాయి. కాటుకకొండల్లాగ ఆకాశంమీాద మేఘాలు నిశ్చలంగా ఉన్నాయి. ఈదరగాలీ - చినుకులు ప్రారంభమయాయి. రామంలేచి "ముసురుపట్టేలాగుంది. వెడతా" అన్నాడు. నేలవైపుచూస్తూ.

"వెళ్ళుదురుగాని, తొందరేముంది: మాబాబాయి ఈపాటికి రావలిసినవాడే. వస్తూఉంటాడు."

"రేపుమళ్ళీవస్తా. పనుంది, పోవాలి."

"ఒకనిమిషం ఆగండి."

"నాతో మాట్లాడేపనుందా: నీకు" అన్నాడు చిరునవ్వు మొలకెత్తగా, రామం.

"మీరుఅంతా మారిపోయారు. బెజవాడలో ఉన్నట్టు లేరే ?"

"నువ్వేమారిపోయావు. నువ్వు నువ్వని ఎంతో చనువుగా మాట్లాడేదానవు, ఇప్పుడు "మీరు" దాకా వచ్చింది. ఏదో అవ్యక్తమైన సంబంధమొకటి విడదీస్తోందేమో మనల్ని."

చిట్టెమ్మకి లజ్జ తరుము కొచ్చింది. శరత్కాల వెన్నెలని మరపించే ఒక అమృతహాసం ఆమె ముఖంమీద మెరసింది. ఆనవ్వుతో పొంగులువారి మృదువులైన ఆమె చెక్కిళ్ళు గుంటలుపడ్డాయి. లజ్జాభరంచేత వాలిపోతున్న తొంగలి రెప్పలెత్తి అనురాగం పొంగిపొరలేటట్టు అతనికేసి చూసింది. శశిరాతి శిశిరమైన ఆచూపుకి రామం గౌరీశంకర శిఖరసాన్నిధ్యాని కొక్కసారి పోయినట్టైంది. ఆప్రేమామృతాన్ని తాగేసేటట్టు, కనులు తెరుచుకొని చూశాడు రామం.

"తుంపర ప్రారంభమైంది. పోవాలి. రేపువస్తాలే" అంటూ గబగబా నడిచి బయటకొచ్చాడు. చిట్టెమ్మ మొగంలో విషాదచ్ఛాయలు గోచరించాయి.

రామం చుట్టు తిరిగి ద్వారగుమ్మం దాటేడో లేదో, చినుకులు పెద్దవయాయి. చిట్టెమ్మ కిటికీలోనుంచి అతను వెళ్ళడం చూస్తోనేఉంది. దబదబా వాన మొదలుపెట్ట గానే రామం వెనక్కి రెండుడగులు పరుగెత్తి గుమ్మంలో చూరుకింద నిలబడ్డాడు. చిట్టెమ్మ అంతా చూస్తూనేఉంది. గబగబా వెళ్ళి తలుపుతీసి "లోపలికిరండి. జల్లుకొడుతోంది" అంది నవ్వుతూ మృదువుగా.

రామం లోపలికి వెళ్ళాడు. ఇద్దరూ వసారాలో నిల బడ్డారు. చిట్టెమ్మ లేడికూనలాగా బిత్తరిచూపులు చూస్తూ గోడనానుకొని నిలబడింది. వసారా నానుకొనే మల్లెపొద బాగాపూచిఉంది. రామాన్ని పిలుస్తున్నట్టుగా గాలికి రెమ్మ లాడించింది. రామం ఒకపూవు కోశాడు.

"ఇది నీకిస్తాను. ఏమిస్తావు!" అన్నాడు నవ్వుతూ పువ్వు చూపించి.

"ఏమీఇవ్వను." అని నవ్వింది చిట్టెమ్మ.

రామం తమకంపట్టశక్యంకాక దగ్గరగా వచ్చాడు. చిట్టెమ్మ ఒకఅడుగు వెనక్కి వేసింది. అతనికళ్ళల్లో పిచ్చి ప్రేమ కనబడిందామెకి. పువ్వు ఇవ్వబోయాడు రామం. చిట్టెమ్మ "నాకెందుకు" అంది.

"నువ్వు సువాసినివయావు. అందుకు సువాసనలు జిమ్మే ఈకుసుమాన్ని ప్రజంటుచేస్తున్నా. ఇది నాహృదయ

కుసుమం. నీయందు ప్రేమతో ఇలాగే నాహృదయం లిచ్చి ఉంది" అన్నాడు.



ఇంతవరకు చిట్టెమ్మ పసరుమొగ్గ. తనయౌవన సౌరభాన్ని తానే ఎప్పుడూ కలలోనైనా గుర్తించలేదనాలి. ఛాందసులమధ్య పెరిగిన దవడంవల్ల ఈనాటి నవనాగరికత ఆమెపొంతకే చేరలేదు. భారత - భాగవత - రామాయణాలూ - ఇంకా పతివ్రతలకథలోతప్ప ఆమెకు మరో వ్యాసంగం తెలియదు.

చలపతిరావుగారింట ఇన్నిరకాల పుస్తకాలూ ఉన్నాయి. మధ్యాహ్నం భోజనాలయాక, ఆయనా - కామేశ్వరమ్మ, చిట్టెమ్మచేత ఆపుస్తకం - ఈపుస్తకం చదివిస్తూ ఉండేవారు. కిన్నెరకంఠంతో చిట్టెమ్మ చదువుతూఉంటే తేనెలొలికేవి. "చిట్టిగొంతు మంచిది. సంగీతం చెప్పిస్తే బాగుండును." అంటూఉండేది కామేశ్వరమ్మ. చిట్టెమ్మ మంగిపూడి వేంకటశర్మగారి వితంతువిలాపం చదువుతూ ఉంటే నల్లరాళ్లు కరిగిపోయేవి. వీరేశలింగంగారి ఉపన్యా

సాలు ఆమెఆత్మకి బలం - ఉత్సాహం - దీక్షప్రబోధిస్తున్నాయి. అంతేకాకుండా తెలుగుసారస్వతంలో ఉన్న మాధుర్యాన్ని కొన్నిగ్రంథాలవల్ల చవిచూసింది. సాహితీ సమితివారి ప్రణయరాగాలు ఆమెయౌవనహృదయ వీణా తంతువుల్ని కదిపాయి. "క్షమార్పణ" అనే నవల సరేసరి ఆమెను కార్యరంగంలోకి దిగమని హెచ్చరించింది. ఒక విధంగాకాదు. పుస్తకపఠనంవల్ల ఆమెమనసు చాలా వికసించింది. మధురభావనలు - ప్రేమ - కాంక్ష - మోహము అనగా ఏమో తెలిసొస్తున్నాయి. "గృహలక్ష్మి" - భారతి మొదలైన మాసపత్రికలు స్త్రీ స్వాతంత్ర్యాన్ని - స్త్రీ గౌరవాన్ని - స్త్రీహక్కులనూ చిట్టెమ్మకి నేర్పుతున్నాయి. మహాత్ముడు ఒక వితంతుబాలవిషయమై చెప్పిన పునర్వివాహోపన్యాసం ఆమెపాలిటికి దేవవాక్కుగా తోచింది. వివేకానంద రామతీర్థస్వాములు విధవావివాహాల్ని బలపరుస్తూ చెప్పిన ధర్మబోధనలు - లజపతిరాయి - కార్వే పండితుల స్త్రీసంఘోద్ధరణప్రయత్నాలు, హృదయంగమములయాయి.

చిట్టెమ్మలోమార్పుకలిగించడానికి సినీమాలు - నాటకాలు కొంత తోడ్పడ్డాయికూడా. శారదాఫిలింకంపెనీవారి "అభాగిని" ఆమెలో తీక్ష్ణవాంఛనీ - మహాసాహసాన్నీ - రగులుగొలిపింది.

పుట్టుబుడకలతో వితంతువులై - మగని పేరైనా ఎరగని ఓ బాలిక. యౌవనదశలో పూర్వాచారపరాయణులైన తలిదండ్రుల రంపపుకోతలకు ఎలాలోనయిందీ - చివరకు ఎలా తన్ను తాను ఉద్ధరించుకొన్నదీ, తెలిపే చక్కని విషాదపూర్ణమైనకథ అది. అందులో మృణాలిని (అంటే ఆఅభాగినే) విపత్తులకెదురీది - కత్తులురాపాడే అడ్డంకుల్నన్నిటినీ ఛేదించుకుంటూ స్త్రీలోకానికి ఆదర్శప్రాయమైన విజయాన్ని గడించింది. ఆవిడ ఆశయాలు - ప్రయత్నాలు- ధైర్యం కొనలుసాగి, భారతీయసంఘదురాచారమలినాల్ని క్షాళనం చేయగలిగేవే.

చిట్టెమ్మకు మృణాలిని కేవలం మార్గదర్శినిఅయింది. ఆమె ఇంటికి వచ్చాక తానే మృణాలిననీ - రమాకాంతుడే రామమనీ భావించుకొని మనస్సులో నాటకమాడేసింది. మృణాలినిలాగా తానూ సఫలీకృతమనోరథ అయినట్లే భావించుకొని ఆనందించింది. ఆఆనందం ఊహాలకందనిది. చిరకాలంకిందట ఈబీజంపడి మొలకై - మానై ఇప్పుడు హృదయసీమనంతనీ కప్పేసిన ఈవాంఛాతరువు చిట్టెమ్మలో నుంచి ఇక ఎన్నిదుమారాలైనా రానీండి ఒక్క ఆకునైనా రాల్చదు.

ఇలాఉండగా ఆరోజుల్లోనే రాజమండ్రిలో ఒక వితంతువివాహమయింది. ఆపెళ్ళికి చాలమంది దేశనాయ

కులు - పెద్దలు వచ్చారు. చలపతిరావుగారు - కామేశ్వరమ్మ - చిట్టెమ్మకూడా వెళ్లారు. చిట్టెమ్మకి ఆనూతన దంపతుల్ని చూస్తూఉండగా ఆమెకి తెలియని చురుకు భావాల్తో, ఆమె యౌవనహృదయం రెపరెపలాడింది.

హాలులో ఇసక రాలడంలేదు. స్త్రీలకు ఎదురుగా పురుషులు కూర్చున్నారు. నూరదంటునూరదిరి చిట్టెమ్మహృదయాన్ని ఆపురుషసంఘంలోనుంచి ఎవరో ఆకర్షిస్తున్నారు. తృష్ణాతురైన చిట్టెమ్మ నేత్రచకోరాలు, రెక్కలువిప్పుకొని, ఆజనంలోకి ఎగిరాయి.

రామం కనిపించాడు. ఇద్దరి చూపులూ కలిశాయి. ఒకరిహృదయం ఒకరికి కళ్ళలో కనిపిస్తోంది. దాంతో చిట్టెమ్మ హృదయంలో గగ్గోలుపెడుతున్న కొత్తకొత్త భావాలుఅన్నీ తెలిసిపోయాయి రామానికి. ఒక్కఅలతి నవ్వు నవ్వాడు. చిట్టెమ్మ అందుకు ప్రత్యుత్తరంగా మళ్ళీ నవ్వింది రహస్యంగా. "అయం ముహూర్తస్సుముహూర్తోస్తు" అన్న పురోహితునివాక్కు, ఇద్దరిహృదయాల్లోనూ మోగిపెట్టింది.

వివాహం పూర్తిఅయింది. అందరూలేచి వెళ్ళిపోతున్నారు. రామం తిన్నగా బండ్లునిలబడ్డచోటికి వెళ్ళాడు. కామేశ్వరమ్మా - చిట్టెమ్మా బండి ఎక్కడానికొచ్చారు. రామాన్ని చూచి కామేశ్వరమ్మ నవ్వుతూ అంది, "అల్లుడుగారూ వచ్చారే" అని.

రామం ముసిముసినవ్వుల్తో "వచ్చానండి" అన్నాడు.

"మీవివాహం అయేదాకా నాకు ఆదుర్దాగావుంది. ఎప్పుడౌతుందో గాని."

రామం సిగ్గుతో తలవాల్చాడు. చిట్టెమ్మ ఓర చూపుల్తో అతన్ని చూసింది.

"ఇంటికేనా ! మీరు." అంది కామేశ్వరమ్మ బండి ఎక్కుతూ.

"మరేనండి."

చిట్టెమ్మ బండిఎక్కబోతోంది. బండిగూడుపట్టుకుంది. ఇంతలో ఓకారు బర్రుమని బండిని తప్పుకొని వెళ్ళడం - ఎద్దుబెదిరి ప్రక్కకి లాగడం - చిట్టెమ్మతూలి పోవడం, ఇట్టెజరిగిపోయాయి. రామం గభాలున చిట్టెమ్మ చేయిపట్టుకొని పడిపోకుండా ఆపేడు. ఈచేతుల కలయికతో ఇద్దరికీ పులకలు కలిగాయి. రామానికి చిరుచెమ్మటలు పోశాయి. ఈసంఘటనచూసి కామేశ్వరమ్మ ఫక్కున నవ్వింది. దాంతో చిట్టెమ్మ మొగం లజ్జాభరంచేత రాగిల్లింది.

ఇలా, క్రమక్రమంగా చిట్టెమ్మ హృత్పాత్ర ప్రణయరసంతో నిండి తొణుకాడి పోతుంది. సమయం చిక్కినప్పుడల్లా, కామేశ్వరమ్మ మనస్సులో - వేషంలో - నడవడిలో క్రొత్తదనాల నేర్పుతోంది, చిట్టెమ్మకి.

# ౧౨

రామం ప్రతిదినమూ వచ్చి పోతున్నాడు చలపతి రావుగారి ఇంటికి. ఈరాకపోకలవల్ల చూపుల్లో - మాటల్లో రామం చిట్టెమ్మలప్రేమ దినదినాభివృద్ధి పొందుతోంది. చివరకు చిట్టెమ్మకు రామం కనిపించనిరోజు దుర్దినం. చలపతిరావుగారు - కామేశ్వరమ్మ వీరి ప్రేమలతకి తగిన దోహదంచేస్తున్నారు వీలుచిక్కినప్పుడల్లా.

చిట్టెమ్మ మధురస్వప్నాలుకంటూ ఊహాగానాలు తీసుకొంటూ రామంలో లీనమైపోవడానికి ఎదురుచూస్తోంది మాటలసందట్లో ఒకసారి రామం చలపతిరావుగారితో చేసిన వాగ్దానం ఆమెహృదయంలో మననంచేసుకుంటోంది. అతని స్పర్శసుఖచిహ్నాలు అణువణువులోనూ చిట్టెమ్మ దేహంలో ముద్రితాలైనట్లున్నాయి. ఆమెలో భార్యాత్వం ఛాయగా కనబడసాగింది. తన భవిష్యత్తునుగూర్చి ఎన్నోకోరికలు - తాను తనప్రియుడు ఏకాంతంగా కూర్చుని ఆనందించిన తియ్యనితలపులు - ఆ ఆనందం - ఆఆశలు - ఆఆశయాలు అల్లికలు, ఎన్నో స్మరణకివచ్చి చిట్టెమ్మకి ఆత్మశాంతిని ప్రసాదించేవి.

రామంకూడా ఇలాగే అమృతపారవశ్యంలో మునిగి తేలుతున్నాడు. చిట్టెమ్మ అతనిపాలిటికి లక్ష్మి - సౌందర్య

జ్యోతిర్మూర్తిన్నీ. అవతారమెత్తిన ప్రణయదేవి అనే అతని ఆశయం. అసోయగం - అమాఘ్ర్యం - ఆఅవయవసౌభాగ్యం అతని హృదయాన్ని పూర్తిగా అపహరించాయి.

ఒకరోజున చిట్టెమ్మ ఆనందసమయంలో, రామాన్ని చేతుల్లోకి తీసుకొని, హృదయంచింపి దీనంగా తన అనురాగాన్ని వెలిబుచ్చింది. అతని రెండుచేతులూ పట్టుకొని సౌభాగ్యభిక్ష పెట్టుమని వేడుకొంది. రామం తానామెను హృదయపూర్వకంగా ప్రేమించాననీ - ఆమెలేని తనజీవితం దుర్ఘటమనీ చెమ్మగిలిన నయనాలతో - అనురాగ పులకిత హృదయంతో చెప్పుకున్నాడు. ఆమెను ప్రేమపుష్పాలతో అభిషేకించి హృదయ సామ్రాజ్యానికి పట్టం కడతానన్నాడు.

ఇంతకుముందు చిట్టెమ్మ వలపెరుగని అమాయిక. రామం స్పర్శవల్ల ఆముహూర్తంనుంచీ ఏదో ఆమెకు తెలియనిది - తెలుపలేనిది ఒకవిచిత్రమైన మార్పు ప్రవేశించింది. అప్రయత్నంగా అతనిమీద గలిగిన ప్రేమాంకురాలు పెరిగి - మ్రానుగట్టాయి. ఆమె చక్షుస్సులో యౌవనాశ - శృంగారచిహ్నాలు - గోచరిస్తున్నాయి. మునుపటి పసిపిల్లల కళ్ళలోఉండే అమాయికపు వెలుగు - ప్రశాంతం. ఇప్పుడులేవు. చిట్టెమ్మలో అకాత్తుగా కలిగిన ఈమార్పు - పీరివలపుచూసి, కామేశ్వరమ్మ తృప్తిజెందింది.

దానా - దీనా ఎనిమిది మాసాలు గడిచినాయి. అక్కడ బెజవాడలో వండిపెట్టేవారు లేకపోవడంవల్ల అన్నపూర్ణ యాతనపడుతోంది రోజూ చిట్టెమ్మని తీసుకురమ్మని సాధించుతోంది దీక్షితులుగార్ని. చివరకి ప్రాణంవిసిగి, పిట్టపిడుగుగా రాజమండ్రీ చక్కా వచ్చాడాయన.

ఆయనని చూడడంతోటే చలపతిరావుగారు- కామేశ్వరమ్మ తెల్లబోయారు. చిట్టెమ్మకి హృదయంలో పెద్ద గొండపడినట్లైంది. పులినిచూడగానే లేడిపిల్ల బెదిరినట్లు తల్లడిలిపోయింది ఒక్కసారిగా పూర్వస్మృతి తెరదీసినట్టు కళ్ళకు కనిపించింది నరకద్వారం తెరిచినట్లైం దామెకి. ఆశలన్నీ అడుగంటాయి. ఉత్సాహం చచ్చింది. చలపతిరావుగారి ఇంట్లో ఆనందధ్వనులే వినిపించడం లేదు.

ఎనిమిదినెలలైంది గదా పుచ్చి ఇకతీసుకెడతానని మెల్లగా తేల్చారు దీక్షితులుగారు. శ్రీరామనవమి వెళ్లింతరువాత తాను బెజవాడలో దిగబెడతానని చలపతిరావుగారు చాలాదూరంచెప్పాడు. కామేశ్వరమ్మకూడా దీనంగా కళ్లనీళ్లుపెట్టుకుని వేడుకొంది. శ్రీరామనవమికి రాజమండ్రీలో ఉత్సవాలు బాగాజరుగుతాయిట చూసివెళ్తానని చిట్టెమ్మ బ్రతిమాలుకొంది. అయితేనేం! దీక్షితులుగారు మాత్రం ఒప్పుకోలేదు.

చలపతిరావుగారి గుమ్మంలో అడుగుపెట్టగానే దీక్షితులుగారి కంటబడినది చిట్టెమ్మ ఆనందస్వరూపం. ఆ వేషం ఆనడక – ఆఉల్లాసం దీక్షితులుగారిలో అనుమానదుమారాన్ని రేపాయి. "ఇదావీళ్ళనాటకము!" అనుకున్నాడు.

"ఆతలదువ్వుకోడం – ఆవాలుజడా – ఆగూడకట్టూ ఏమిటీవేషాలు అడిగేవాడంటూ లేక. చెపోటి తీసుకుని ఈదవడా ఆదవడా వాయించక ఈపోకిళ్లు మిటి! పొయ్యేగాల మొచ్చింది బొత్తిగా. అందులోనూ వీళ్ళు ఉత్తనూలముండా వాళ్లు. చిట్టెనికూడా మూలమతంలోకి దింపినట్టుగా ఉన్నారు. ఈవ్యరసచూడగా పెద్దా – చిన్నా అంటూ ఉంటేగా. ఎవళ్ళేమనుకొంటారో అన్న ఏకువుంటేగా! ఆరి వీళ్ళ దుంపతెగా. బొట్టుమినహా, ఏముంది అంతా పునస్త్రీవాల కమే, పచ్చిబోగందానికిమల్లే. చెవులు నులిపి లాక్కుపోతేనే సరిగాని, లేకపోతేనా అమ్మమ్మో! ఇంకేమన్నాఉందా" అనుకున్నాడు. ఎవరెంత చెప్పినా ససేమిరా అని దీక్షితులుగారు మెత్తపడలేదు. చిట్టెమ్మ బెజవాడ వెళ్ళవలిసిందే.

"పిన్నీ! నేను బెజవాడే వెళ్ళితే బతకలేనే. అన్నపూర్ణ కోసిచంపుతుంది. మానాన్న ఆవిడగీసినగీటు దాటడు ఇంకనాగతేమిటి" అని కామేశ్వరమ్మతో చెప్పుకొని యేడ్చింది చిట్టెమ్మ.

"వెళ్ళక తప్పుతుందా మరి. ఉత్తరాలు రాసి పోస్టులో వేయించుతూఉండు. ఇక్కడ మేము ఏర్పాటులన్నీ చేస్తూ ఉంటాము. మధ్యమధ్య రామంవచ్చి చెబుతూఉంటాడు. పరవాలేదులే:" అన్నారు చలపతిరావుగారు.

కొన్నికవర్లూ - కాగితాలూ - పెనిసిలు ఇచ్చాడు. చిట్టెమ్మ పెట్టెలో భద్రపరుచుకొంది. కామేశ్వరమ్మ ధైర్యంచెప్పింది. నెలరోజుల ఈలోపుగానే వివాహం రైటు చేస్తామనికూడా అభయమిచ్చింది.

చలపతిరావుగారు స్టేషనుకు సాగనంపాడు. ఈసంగతి రామానికి తెలియకుండా ఉండలేదు. అతనూవచ్చాడు స్టేషనుకి. చూచాడు చిట్టెమ్మ వడగాడ్పుకు కమిలిన పుష్పంలాగ వాడిన వదనం - చెమ్మగిలిన నయనాలుతో రామాన్ని చూడగానే రహస్యంగా రోదనంచేసింది. రామం కంట తడిపెట్టాడు. ఇదిచూసి చలపతిరావుగారు ఓనిట్టూర్పు విడిచాడు.

రైలుసాగింది. రామంచూపులు రైలుతో పరుగెత్తాయి. చిట్టెమ్మహృదయాన్ని రామానికిచ్చి, బాష్పపూరితనయనాలతో వెళ్ళిపోతోంది. చలపతిరావుగారు రామం ఏదోపోగొట్టుకున్నవారికి మల్లే ఇంటికి చక్కావచ్చారు.

మనస్సు - చీకుచింతలు లేక నిర్మలంగానూ ఉత్సాహంగానూ ఉడడంవల్ల - చాకిరీ లేకపోవడంవల్లా - తగిన పోషణాదులవల్లా చిట్టెమ్మ సర్వాంగాలూ పొంగులువారి నవనవలాడుతున్నాయి. అదిగాక ప్రణయరసాన్ని రుచి చూచిన మహాసంతృప్తి - ఆనందం మరింత ఆమెసౌందర్యానికి మెరుగులు దిద్దాయి. అన్నపూర్ణ చిట్టెమ్మనిచూచి అసూయపడదూ పడింది. చిట్టెమ్మ నేత్రాల్లో వలపుతరగలు వేస్తూనేఉన్నాయి. అన్నపూర్ణ గ్రహించింది. చిట్టెమ్మకి ప్రేమానుభవం కలిగిందనీ - ఓప్రణయమూర్తిని సంపాదించి ఉండాలనిన్నీ.

దీక్షతులుగారితో చిన్నెలు - వన్నెలు తగిలించి చెప్పడం మొదలుపెట్టింది అన్నపూర్ణ. ఇదివరకే నాటిన అనుమానాంకురం క్రమక్రమంగా ఆకులుతొడిగింది, ఆవిడ పుణ్యమాఅని. చిట్టెమ్మకంటపడితేనే చాలు దీక్షతులుగారికి సూదులుగుచ్చుకున్నట్టుంటోంది.

చిట్టెమ్మ వచ్చిన క్షణంనుంచీ చీపురూ - అంట తప్పాలా చేతపట్టింది. అన్నపూర్ణ గృహరాజ్యపాలనకి తిరిగి పూనుకొంది. మళ్ళీ ద్వ్యధిస్రితములైన వీరి జీవనవాహినులు కలుసుకోవడమెలా! కలహాలు ప్రారంభం. దీక్షతులుగారు గృహరాణి అన్నపూర్ణ ఆజ్ఞల్ని అమల్లోపెట్టడానికి రిజర్వుపోలీసు లాఠీతో హమేశా హాజర్.

చిట్టెమ్మ ఈదుర్ణయాలన్నీ రాజమండ్రీ రాస్తూనే ఉంది. చలపతిరావుగారివల్ల రామం తెలుసుకుంటూనే ఉన్నాడు. "ఈనరకకూపంలోనుంచి త్వరగా తప్పించాలి" అంటూ కామేశ్వరమ్మ తొందరచేస్తోంది. రామంకూడా ఆలాగే ఆదుర్దాపడుతున్నాడు. అయితే కల్యాణఘడియల కోసం ఎదురుచూస్తూన్నారు.

ఇక్కడ చిట్టెమ్మ వీలు చిక్కినప్పుడల్లా తన భవిష్యత్తునుగూర్చి యోచిస్తూఉండేది. రామంలో తాను లీనమైపోయే సుభముహూర్తాన్ని గూర్చి తలుచుకుంటే అతనిపేరుతల్చుకుంటే ఆమెకు పులకలుగలిగేవి.

"మాఅమ్మ బ్రతికుంటే ఇలా చేస్తాడానాన్న. అమ్మ లేనినాడు జగమంతా అంధకారమే కడుపులోపెట్టుకొని ఆదరించేవా రెవరున్నారు! ఆవిడపోగానే నాన్నకూడా పరాయివా డయాడు. అన్నపూర్ణకి కొడుకుగాని - కూతురు కాని పుడితే, నాగతి మరీఅధ్వాన్నమై పోతుంది." అనుకొని దుఃఖించింది. తనతల్లి బ్రతికున్న ఆరోజులు జ్ఞాపకానికొచ్చాయి. ఆనాడు తనతల్లి తనకి బొట్టుపెట్టడం స్మృతికి తోచింది. "బొట్టు పెట్టుకుంటే ఎలాఉంటాను" అనుకొంది.

అర్థరాత్రి సమయం. అన్నపూర్ణా - దీక్షితులుగారు, గదిలో గాఢనిద్రలో మునిగిఉన్నారు. చిట్టెమ్మ లేచి, కొట్టు గదిలోకి నెమ్మదిగా వెళ్ళి లైటు వెలిగించింది. దొంగకు

మళ్లీ గుండెలు కొట్టుకొంటున్నాయి. మధ్యమధ్య "నేనేం చేస్తున్నానని భయం! ఇదేం దొంగతనమా! లంజతనమా" అని ధైర్యం తెచ్చుకొనేది.

తలుపులు మూసేసి బొట్టుపెట్టుకుంది. తనమూర్తిని అద్దంలో చూసుకొని మురిసిపోయింది. తను, ఇంత అందంగా ఉన్నాననీ - తనకికూడా సువాసినీ లక్షణాలున్నాయనీ, "బొట్టుపెట్టుకొంటే నేను అన్నపూర్ణలాగానే ఉన్నాను. ఇంక నా మొగంలో కళంకమేముంది!" అనుకొని పొంగి పోయింది. "ఎప్పుడూ ఇలా ఉంటే! ఎందుకుండగూడదు! ఇది వితంతువనీ - ఇది పునిస్త్రీఅని తెచ్చిపెట్టుకుంటే వచ్చాయిగాని, సహజంగా పుట్టుకతో ఏర్పడినవా! మొగుడు పోయేడు కనుక విధవా? అంటే అర్థమేమిటి!" అని తర్కించుకొంటూ అద్దంముందు నిల్చింది.

అలా ఎంతసేపున్నదీ - ఇంత రాత్రివేళ తానుచేస్తున్న పని ఆగాయిత్యమనీ - ఎవరైనా చూస్తే గొంతుకపిసుకుతారనీ, తోచలేదు చిట్టెమ్మకి. నివురుగప్పిన నిప్పులాగా - మబ్బుదాచిన చంద్రుడులాగా, ఇంతవరకూ బలవంతాన దాచిఉంచిన తన సౌందర్యశోభా - విలాసం అదీ చూచుకొని, ఆమె పారవశ్యం పొందింది.

ఇటువంటి ఆనందసమాధిలో ఆమెఉండగా, బైట అన్నపూర్ణ తలపంకిస్తోంది.

చూశారా! జీవుడికి మృత్యువుమాదిరిగా అన్నపూర్ణ ఈమెను వెన్నంటేఉంది. ఆవిడ ఎందుకోసావిట్లోచూస్తే చిట్టెమ్మ కనిపించలేదు. కొట్టుగది రంధ్రంలోనుంచి వెలుగు కిరణాలొస్తున్నాయి. చిట్టెమ్మ ఏ ప్రియుడుతో నేనాఉందేమో కులుకుతూ. ఇప్పుడుగాని పట్టుకుంటే తనకసి తీరుతుందను కొంది. మెల్లిగా తలుపుసందుల్లోంచి చూసింది. చిట్టెమ్మ బొట్టూ అదీ పెట్టుకొని మధురభావనలు తలపుకురా ఒయ్యారంగా నిలబడిఉంది చేతనవ్వుతో. పెదిమలు కదుల్తున్నాయి. "సందేహంలేదు, ఎదురుగా ఎవడోఉన్నాడు, కనబడడం లేదు" అని నిశ్చయించుకొంది అన్నపూర్ణ చప్పుడుకాకుండా పక్షిలాఎగుర్తూపోయి దీక్షితులుగారిచెవులో ఊదింది. నిద్రలో అమాంతంగాలేచి "ఏఁ" అని వెర్రికేకవేశాడాయన. దొంగలేమన్నా పడ్డారేమోనని ఆయన తాసాలుబందయాయి. అసలుసంగతేదో అన్నపూర్ణ ఊదేశింది. "ఆఁ – ఆఁ" అంటూ ఉగ్రుడై లేచాడు. ఆయనవెనకా – అన్నపూర్ణముందూ. తలుపుదగ్గిరికి చేరారు. చూడమని సౌంజ్ఞ చేసింది అన్నపూర్ణ. దీక్షితులుగారు తొంగిచూశాడు. చిట్టెమ్మ తన్మయంలోఉంది. తలుపు గెంటుదామా అనుకొన్నాడు. కానైతే తలుపు ఘడియవేసిలేదు. లోపలున్నవాడు బుర్రకాయ బదలుకొట్టి పారిపోతాడేమోనని భయమైంది దీక్షితులుగారికి. గుండెలు పీచుపీచుమంటున్నాయి.

మాట్లాడకుండాపోయి పడుకొని పొద్దున్నే చిట్టెమ్మని దండించడమో - ఏంచెయ్యడమో, చూడొచ్చుననుకున్నాడు.

ఇంతలో చిట్టెమ్మ తలుపు నెమ్మదిగా తెరుస్తోంది, ఇవతలికిరావాలని. వాడెక్కడ కొట్టిపోతాడోనని దీక్షితులుగారు మూలగా - మూలగా నక్కుతున్నాడు. ముచ్చెమ్మటలు పోశాయి. చిట్టెమ్మ తలుపుబారుగా తెరవడంతో, ఎదురుగా పెద్దపులిలా అన్నపూర్ణ దర్శనమైంది. ఆమె నిలువునా నీరైపోయింది. కానీ, ఏదో వంకచెప్పొచ్చునని ధైర్యం తెచ్చుకుంది. బొట్టు ఇదివరకే చెరిపేసింది. చిట్టెమ్మ మాట్లాడకుండా ఇవతలికి వచ్చి, తలుపుగొళ్ళెం పెడుతోంది. ఆపాటున అన్నపూర్ణ చిట్టెమ్మచేయి పట్టుకొని, "ఉండు గొళ్ళెంవేస్తావెందుకు: లోపలున్నాడా!" అని గదమాయించింది, కళ్ళెర్రచేసి.

"ఏమిటది:"

"ఏమిటా: ఏమిటా:" అంటూ అన్నపూర్ణ తలుపు తెరిచి లోపలికి వెళ్ళింది.

ఈసారి వాడెవడో బయటికొచ్చి నాలుగూ తంతాడని రూఢిచేసుకొని దీక్షితులుగారు తల చేతుల్లో కాపుచేసుకొన్నాడు. అన్నపూర్ణ దీపంతీసుకొని, గదినాలుగు మూలలా బియ్యం బస్తాలచాటునా - చాపచుట్టల్లోనూ, గడమంచీకిందా వెతికింది. ఎవ్వరూ లేరు.

"ఎక్కడ దాచావు:"

ఏబియ్యేమో - పప్పే దొంగచాటుగా అమ్మకో డానికి దాచాననుకొందేమో ననుకొని చిట్టెమ్మ "ఏందాచా నంటావు. దొంగతనం కట్టొచ్చావా: బాగానేఉందిలే, పద:" అంది తృణీకారంగా.

"వగలమారిదానా! నూబాగా తప్పుకున్నావులే"

"ఎందుకలా నోరుచేసుకొంటావు. చూడు, ఏం చూస్తావో!"

ఇప్పటికి లోపల ఎవరూ లేరని నమ్మకం తోచింది దీక్షతులుగారికి. ఎక్కడలేని ధైర్యం తెచ్చుకొని, పీరు డులా, ముందుకొచ్చి, "ఓసిభడవా: ఎటువంటి బుద్ధులు పుడుతున్నయీ!"

ఆమాట వినేసరికి చిట్టెమ్మ హృదయం సహస్ర శకలాలై పోయింది.

"చూశారా! ఎలాబుకాయిస్తోందోను." అని అన్న పూర్ణ పుల్ల ఎగసినతోసింది.

"ఏవిటీ పోకిరీనడత: జుట్టుచ్చుకొని అవతలకీడ్చి పారే స్తాను. చూడు: మా మిట్టిపడిపోతున్నావు: నీమిడిసిపాటు ఇద్దైపోను."

"ఈనగలు - జుట్టూ చూసుకొని: మామిడిసిపడిపో తోంది." అంది అన్నపూర్ణ.

చిట్టెమ్మ ఆమెకేసి రూక్షంగా చూసింది.

"తీసి ఇలా ఇయ్యి." అన్నాడు దీక్షతులుగారు. చిట్టెమ్మ నోటమాట లేకుండా, భయంతో అలానిలబడిఉంది.

"నింపాదిగా ఇమ్మంటే ఇస్తుందా, లాక్కునీదాకా !" అని అన్నపూర్ణ బలపర్చింది.

"ఏం, ఇస్తావా, లేదా:"

చిట్టెమ్మ కొంచెం తలయెత్తి "ఎందుకూ:"

"ఎందుకా: నీయెధాన్ని పెట్టడానికి. ఇయ్యవే."

"నానాన్న.

మంచిగా ఇచ్చేటట్టు లేదని దీక్షతులుగారు చేయి చేసుకోవలిసొచ్చింది. అన్నపూర్ణ సాయం చేసింది. పట్టిబలవంతాన ఇద్దరూకలిసి, చిట్టెమ్మ నగలన్నీ ఒల్చారు. చిట్టెమ్మ ఏడ్చింది. బ్రతిమాలింది. కాళ్ళా - వేళ్ళాపడింది. దీక్షతులుగారి మనసు కరగలేదు. అన్నపూర్ణని చిట్టెమ్మ ఓ తోపుతోసింది. కాని, ఎంత పెనగులాడినా లాభంలేకుండా పోయింది.

అన్నపూర్ణకి పక్కలో ఒక తోపు తగిలింది. "అబ్బా:" అనీ, "చూడు, ఏంపోగరే: నీదుంప తెగా, జుట్టూ గిట్టూ గొరిగించి, గుండుచేయిస్తేనేగాని పొగరణగదు." అంది.

ఆరాత్రి తెల్లవార్లూ, ప్రక్కలో దొర్లుతూ, చిట్టెమ్మ కళ్ళువాచేటట్టు ఏడుస్తూనే ఉంది. ఇందులో తనతప్పేమిటో అర్థంకాలేదామెకి.

# ౧౩

రామం సహాయనిరాకరణోధ్యమములో జేరి అందరితో కలసి శాసనోల్లంఘనము కావించుటవల్ల మేజిస్ట్రేటు గారు విచారణసలిపి ఆరుమాసములు కఠినశిక్ష విధించారు.

పత్రికల్లో వీరందరి పేర్లూ పడ్డాయి. చలపతిరావు గారు చదివి, కామేశ్వరమ్మకీ చెప్పారు. కామేశ్వరమ్మ నిస్పృహతో విని, చాలాదిగులు పడింది. ఈ వార్త ఎలాగో చిట్టెమ్మకి తెలిసిపోయింది. గుండె బెదిరిపోయింది. రామం ఆడితప్పాడా అనుకుంది. నిరాశపొందింది. ఆరోజంతా గోలు గోలున విలపిస్తూనే ఉంది. తలనొప్పిగా ఉందనీ, ఒంట్లో బాగా లేదనీ వంక పెట్టి తలుపులు వేసుకొని గదిలో పడుకుంది. మనసు పరిపరివిధాల పోయింది. రామం ఎలాగైనా వివాహం తప్పించుకొందామని చేసినపనా! లేకపోతే, దేశభక్తితో చేసిందా! అని ఆలోచించింది. ఆమె ఎరిగినంత వరకు రామం ప్రవర్తనలో కాని అతని ప్రేమ ప్రకటనలో గాని, ఏకళంకమూ ప్రత్యక్షం లేదు. ఆలోచించింది. ప్రతిఘట్టమూ స్మరణకి తెచ్చుకొని రామానికీ తనకీ జరిగిన ఒక్కొక్క మాటా జ్ఞప్తికి తెచ్చుకొని, చివరకు రామంలో మరొకతలపు లేదని రూఢిచేసుకొంది. అయితే. ఈవియోగాన్ని భరించడం ఎలాగ? దుఃఖం తరుముకొస్తోంది చిట్టెమ్మకి చెరసాలలో అతను ఎలాకష్టపడుతున్నాడో! ఎలా ఉన్నాడో!

ఆగోధూళివేళ చిట్టెమ్మ దొడ్డిగుమ్మంలో నిలబడి వీధివైపు చూస్తూంటే రామంతమ్ముడు విశ్వేశ్వరం అలా రోడ్డుమీద వెళ్ళుతున్నాడు. అతని ముఖం విషాదంగాఉంది చిట్టెమ్మ అతన్నిపిల్చి "ఏమిటి విశేషాలు" అంది. "ఏమీ లేదు" అన్నాడాతను.

"ఎక్కడికి తొందరగా పోతున్నావు"

"బండికోసం"

"ఏంపని"

• "మాఅన్నయ్య [illegible] రాయవెల్లూరుజైలుకు వెళ్లు తున్నాట్టు ఈసాయింత్రి [illegible] మాఅమ్మ చూడడానికి రైలుదగ్గరకి వెడతానంది"

"మీకేలా తెలిసింది."

"ఉలిగ్రాం వచ్చింది. [illegible] స్నేహితులు విశాఖ పట్నంనుంచి ఇచ్చారు."

తానుకూడా రైలుదగ్గరకెవెళ్ళి అతన్ని చూసేదాకా మనసాగిందికాదు. గుండెలు కొట్టుకొంటున్నాయి. భోజన మైనా చేయలేదు. నీరసంగాఉంది. పైగా తరగని విచారం బెంగ - ఆదుర్దా.

వెంటనే సుందరమ్మగారింటికి వెళ్ళి తానూ రైలు దగ్గరకివస్తానంది. సుందరమ్మ కంటనీరు పెట్టింది. చిట్టెమ్మ పరామర్శగా ఊరడించింది. సుందరమ్మ ఒక్కర్తేవెళ్ళలేక చిట్టెమ్మ సాయంవస్తానన్నందుకు చాలసంతోషించింది.

చిట్టెమ్మ సుందరమ్మతో రైలుదగ్గరకి వెడుతున్నానని ఇంట్లో ఎవరితోనూ చెప్పలేదు. ఇద్దరూ సరాసరి జట్కాఎక్కి వెళ్ళారు. అన్నపూర్ణ బండిలో ఇద్దర్నీ చూసింది. తల కొంచెం కదిలించింది.

వీరు వెళ్లేసరికి రైలు ప్లాటుఫారంమీదకి ఒచ్చి ఆగింది. ఎస్కార్టుగా వచ్చిన రిజర్వుపోలీసుభటులు కంపార్టుమెంటు ముందు బారుగా నిలబడి జనాన్ని దూరంగా తరుముతున్నారు. చేతిలో పిస్తోలుపట్టుకొని సార్జెంటు ఇటూ - అటూ నేల కొలుస్తున్నట్టు పచార్లుచేస్తున్నాడు. జనం గుంపులు గుంపులుగా మూగి, ఆదేశభక్తుల్ని చూస్తున్నారు. ఎవరికితోచింది వారు మిఠాయిపొట్లాలూ - మామిడిపళ్లూ కంపార్టుమెంటులోకి విసుర్తున్నారు చాటు చాటుగా.

సుందరమ్మ - చిట్టెమ్మా దూరంగా నిలబడి ఉండడం రామం చూచాడు. సార్జెంటుని పిల్చి "మాఅమ్మా - వాళ్ళూ వచ్చారు కొంచెం దగ్గరకి రానీయాలి" అని అడిగాడు. సార్జెంటు స్వతహాగా కరుణార్ద్రహృదయుడవడంవల్ల సరే నన్నాడు. జనాన్ని తప్పించి ఓపోలీసు వారిరువుర్నీ దగ్గరకి తీసుకొచ్చాడు.

సుందరమ్మ కళ్లనీళ్లు కారుస్తూ "అబ్బాయీ" అంది రుద్ధకంఠంతో. మరి మాటపెకిలిందికాదు. చిట్టెమ్మకిన్నీ

హృదయాన్ని చింపుకొని దుఃఖం పొర్లి పొర్లి వస్తూనేఉంది. కానైతే బయటికి ధీమాగానే నటించింది.

అన్నాడుకదా రామం, బ్రహ్మానందం తొణుకాడుతున్న చూపుల్తో. "అమ్మా: ఎందుకే అలాఏడుస్తావు, వీరమాతననుకొని సంతృప్తిపడక. వెనక జపానులో ఒకడు తల్లిమీదఉండే ప్రేమవల్ల సైన్యంలోంచి తిరిగొచ్చాట్ట. అప్పుడు తల్లి తనమూలాన్నకదా, కొడుకు దేశంకోసం బలికాలేకపోయాడని, వెంటనే గుండెచీల్చుకొని, మరణించింది. అప్పుడు నిశ్చింతతోపోయి, సైన్యంలో చేరాడు. అలాంటి వీరమాతలుకావాలమ్మా! ఇప్పుడు. ఇంకొకావిడ, ఎనమండుగురుకొడుకులు మాతృదేశంకోసం చచ్చిపోతే, తొమ్మిదోవాడు లేకపోయాడే అని ఏడ్చింది. వీరపత్నుల సంగతీ అంతే. ఎన్నివింటున్నాంకాదు. నీవేమీ దిగులుపడకు. నాకేం పరవాలేదు. ఏడవడం పిరికితనం - అపశకునమున్నూ. వీలైతే, నువ్వుకూడా రావడమే నాఅభిమతం." అన్నాడు.

సుందరమ్మకి ఈసంగతులేమీ అంతగా నచ్చలేదు. చిట్టెమ్మకి మట్టుకు కొంతహృదయంగమమైంది. ఇంతలో బ్రైనుపోయింది. గైలుకూసింది. సుందరమ్మ ఒకడుగు కదిలింది. చిట్టెమ్మ - ప్రేమవిషాదాలు కనబరుస్తూ దీనంగా రామంవైపు చూసింది. రామం సన్నమెలుగున ఇట్లన్నాడు.

"చిట్టీ, నువ్వు మరోలాగా అనుకోకు. ఆరుమాసాల్లో తిరిగొస్తాను: నాలో ప్రేమ తరగలేదు. నీకూ అంతేనని నా నమ్మకం. నువ్వుకూడా శ్రీకృష్ణజన్మస్థానయాత్ర చేస్తే బాగుంటుంది. వృథాగా విచారం పెట్టుకొని, మనసునికష్ట పెట్టుకోకు."

## ౧౪

చిట్టెమ్మ ఆశలు శకలాలయిపోయాయి. రామం అనే వృక్షాన్ని ఆశ్రయించాలని అర్రులు చాచుకొన్న ఈలతకూన ఇప్పుడు ప్రాపులేకుండా పోవలిసొచ్చిందని క్షోభిస్తోంది. కానైతే ఈవిచారం చిరకాలండుండేది కాదు. ఇంతమాత్రంలో రామానికి దూరమైపోయానని చిట్టెమ్మ దుఃఖించకూడదు. కాని కష్టపరంపర రానున్న ఆనందస్మృతి ఆమెనట్లాచేశాయి.

రామం ఆరుమాసాలవరకూ రాడు. అతను లేనప్పుడు చిట్టెమ్మకి ఈలోకం కేవలం నరకమే. తానుకూడా రామం చెప్పినట్టు జయిలుకి వెళ్ళాలంటే ఎలాగ! చిట్టెమ్మ దీక్షితులుగారు ఎంత రుసరుసలాడినా అన్నపూర్ణ ఎంతచాడీలు

చెప్పినా లెక్కచెయ్యకుండా మధ్యాహ్నమప్పుడు రామం గారింటికి వెత్తనానికని వెళుతూనేఉంది. విశ్వేశ్వరం ఆంధ్ర పత్రిక తెచ్చి రోజూ సుందరమ్మకీ - చిట్టెమ్మకీ చదివి వినిపిస్తున్నాడు. ఆసంగతులు వింటున్నకొద్దీ చిట్టెమ్మ హృదయం విశాలమౌతోంది.

చిట్టెమ్మ ఓనాడురాత్రి దీర్ఘంగా ఆలోచించింది. ఇప్పుడు కర్తవ్యమేమిటా అని రాజమండ్రి ఉత్తరంవ్రాసింది. కామేశ్వరమ్మ ఈఆరుమాసాలూ ఎలాగో కళ్ళు మూసుకొని కాలక్షేపం చేయవలసింటుంటూ వ్రాసింది. చిట్టెమ్మకి ఈవ్రాత ఏమీ రుచించలేదు. చూస్తూ ఈబాధఎలాపడడం.

ఆరోజుల్లో ప్రతిచోటా 144 సెక్షను అమల్లోఉంది. రాత్రికి రాత్రి ఏచెన్నపట్నమో పారిపోయి, అక్కడ అరెస్టయిపోతే కొన్నాళ్ళపాటు ఆత్మకి ఊరటకలుగుతుందేమో నని ఆలోచించింది చిట్టెమ్మ. అయితే ఇలా చెప్పకుండా లేచిపోవడం అవమానకారణమేమో ననుకొంది మళ్ళీ. ఎందుకౌతుంది! ఆమర్నాడు రాత్రిమేలుకి మద్రాసు వెళ్ళిపోవాలనే నిశ్చయించింది చివరకి.

ఉదయాన్నే పైడితల్లిని పిల్చి అంతా చెప్పి రాత్రి తనను మేలు ఎక్కించవలిసిందని అడిగింది. పైడి సరేనంది.

యథాప్రకారంగా సుందరమ్మగా రింటికి బయలు దేరినట్టుగా, బయలుదేరింది చిట్టెమ్మ. కానైతే పాదరసపు

బిందువులాగా ఆవిడ హృదయం చలించిపోతోంది. ఎక్కడికి వెళ్ళాలి! ఏంచెయ్యాలి! ఏమీపాలిపోవడంలేదు. ఎన్నడూ ఇల్లువదిలి రానిది, ఇప్పుడు బయటికి రావడం చిక్కే. పంజరంలోనుంచి విడువబడ్డ చిలుకకి స్వాతంత్ర్యం కూడా ప్రాణసంకటంగానే ఉంటుంది. అలాగే చిట్టెమ్మ విషయమున్నూ. అయితే. తెగించి బయటపడ్డాక, సమయోచితంగా ఆడూహాలు – ఆఎత్తులు తమంతటవే తోస్తాయి. బయలుదేరనంత సేపే ఏభయమన్నాను. అది అలా ఉంచి, ఈలోగానే దీక్షతులుగారు పట్టుకొంటే !

కథే అడ్డుతిరుగుతుంది. అలాగే అయిందికూడాను. అన్నపూర్ణ పెద్ద డిటెక్టివ్. ఎలాకనిపెట్టిందో కనిపెట్టింది. పైడి, చీకటి చాటున ఏదో మూట పట్టుకు పోవడం – మరో గంటకి చిట్టెమ్మ బయలుదేరడం, ఆమెకి అనుమానం తోచింది. వెంటనే దీక్షతులుగార్ని "క" ఇచ్చి పంపింది.

అలాగే ఆయన ప్లాటుఫారంమీద పైడి మద్రాసుకి టిక్కెట్టుకొంటూ ఉండగా, పట్టుకొన్నాడు. చిట్టెమ్మ, దూరంగా కిర్సీడ నిలబడిఉండి చూసింది దీక్షతులుగార్ని. ఏముంది. ఆమెకి పంచప్రాణాలూ ఎగిరిపోయాయి. శరీరం గిరగిర తిరిగిపోతోంది. అలాగే స్తంభాన్ని జేరగిలబడి, కూలబడిపోయింది మూర్ఛగాని మూర్ఛలో మునిగిపోయింది.

తిరిగి స్మృతికి వచ్చేసరికి దీక్షితులుగారు తనచేయి పట్టుకొన్నట్టు తెలుసుకొంది.

"ఎందుకిలా వచ్చావు ?"

"పట్నం వెళ్ళడానికి." అని నిర్భయంగా, వెంటనే జవాబు చెప్పేసింది చిట్టెమ్మ. ఆమె చెప్పడమేమిటి ! నోటి నుంచి అప్రయత్నంగా వచ్చేసింది.

"ఆసినీబొడ్డు పొక్కా.. !"

"నేను ఇంటికి రాతలుచుకోలేదు."

"బలవంతాన లాక్కుపోతాను. ఏమనుకొన్నావు. కాకపోతే, పోలీసువాళ్ళచేత ఈడ్పిస్తాను. పైగా రానని చెబుతున్నావా: దిప్పకాయలాగా. తొక్క తీలుస్తాను చూడు."

"చంపినాసరే, నేను రాను."

"రావుగా:"

"ఉఁహుఁ"

దీక్షితులుగారికి కోపం ఆపలేనంతగా వుస్తోంది. కాని, అతికష్టంమీద మింగుతున్నాడు. లేకపోతే నలుగురుకీ తెలిసిపోయి అప్రతిష్ట కలుగుతుందని భయం. చిట్టెమ్మ ఇంతవరకూ వచ్చాక, ఇకభయమెందుకని ధీమాగా ఎదిరిస్తోంది. దీక్షితులుగారు నయాన్నేగాని భయాన్ని ఆమెని ఇంటికి తీసుకువెళ్ళడం కుదరదని నిశ్చయపర్చుకొన్నాడు.

"అమ్మాయీ! నలుగుర్లోనూ తలవొంపు లెందుకు తెస్తావేనాకు" అన్నాడు దీనంగా.

"నువ్వే బుద్ధిపూర్వకంగా తెచ్చిపెట్టు కొన్నావు. ఇంకా తెచ్చుకొంటావు."

"ఇలా మారిపోయావే!"

"ఇంకా మారిపోతాను."

"సావకాశంగా నీమనసులో ఉన్న ఉద్దేశ్యం ఏమిటో చెబుదుగాని ఇంటికి రా"

"ఈఆలోచన - ఈఓర్పు ముందేఉంటే అంతా బాగానేఉండిపోను"

"ఇప్పుడుమాత్రం మించిపోయిందేముంది. నీయిష్టం ఎలాగో అలాగే చేస్తానంటున్నాగా. చూశావా అమ్మాయి తండ్రిని - పెద్దవాణ్ణి నీకు అన్యాయం చేయనుగదా! ఆలోచించు" అంటూ ఏమేమో మనసుకరిగేలాగా దీనంగా చెప్పి మొత్తానికి చిట్టెమ్మని ఇంటికి తీసుకొచ్చాడు.

చిట్టెమ్మకోరిక నెరవేరినట్లే. ఆమె జయిలుకోరుకొంది. ఆజయిలు ఇప్పుడు సంప్రాప్తమైంది. ఆఇంట్లో చిట్టెమ్మ ఇప్పుడుఖైదీ స్టేషనుదగ్గిర దీక్షతులుగారు చెప్పిన మెత్తనిపలుకులన్నీ తాత్కాలికమైనవే. తీరా వచ్చాక ఆయనే అంకుశమయాడు.

ఒకగదిలో బంధించారు చిట్టెమ్మని ఆవిడ కేకలు వేసినా ఎవరికీ వినబడవు. తిరిగి చిట్టెమ్మకి దీక్షితులుగారు కాన్పించేలేదు. వేళకి అన్నంపెట్టడానికి - దానికీ అన్నపూర్ణ ప్రతిక్షణమూ కనిపిస్తూనేఉంది. ఒకరితో ఒకరు మాట లాడుకోరు.

దీక్షితులుగారి ఈద్రోహానికి ఆపాదమస్తకమూ చిట్టెమ్మకి మండిపోతోంది. ఆమె మునుపటిమాదిరిగా దుఃఖం చడంలేదు. ఇప్పుడు ఎంతసేపూ కోపం - ప్రతీకారం మాత్రమే ఆమెలో ఈదౌర్జన్యం ఇలాఎంతకాలం సాగు తుందో తానూచూడాలనుకొంది.

ఎంతధైర్యం వహించినా మధ్యమధ్య స్త్రీసహజమైన దుఃఖం కనబడకమానదు. తన ప్రస్తుతదుస్థితి - రామంతో తనకు గలిగిన పరిచయం - ఆమధురమైన తలపులు, స్మృతికి వచ్చినప్పుడలా ఆమెకు దుఃఖం పొంగి వస్తూనేఉంది.

ఈవియ్యం రాజమండ్రి తెలపాలంటే ఎలా! అన్న పూర్ణతప్ప ఇంకెవరూ ఆమెకంటికి కనిపించడమే లేదు. దీక్షి తులుగారు కనిపించినా, తనహృదయరోదనాన్ని ఆయన ముందు వెలిబుచ్చాలని అనుకొంది. నిర్మొహ్మాటంగా ఆయనతో తన విషయం తెంపుజేసుకోవాలని నిశ్చయించుకుంది. అయితే ఆయన కళ్ళబడితేగా.

రెండోరోజున అన్నపూర్ణ తలుపు తెరిచి, అన్నం తీసి కొచ్చింది. అసలు చిట్టెమ్మకి ఆవిడతో మాట్లాడడం ఇష్టం లేకపోయినా - బలవంతంగా మాట్లాడక తీరిందికాదు.

"నాన్న ఊళ్ళో ఉన్నాడా."

"ఎందుకూ."

"మాట్లాడాలి."

"ఓసి.నాయన: రాజకీయ వ్యవహారాలు మునిగిపో తున్నాయి కాముసు."

"వ్యవహారాలు లేనిమనిషంటూ ఉండరు. నాకూ, అలాటివే ఉన్నాయనుకో: నీకంత ఆక్షేపణెందుకు ! నాలిక సరిగ్గా తిరగదేమిటె నీకు."

"నోరుమూయి. దవడవిరగగల్లు."

ఈమాటతో చిట్టెమ్మకోపం మేరలు దాటింది. తాచుపాములాగా చివాలున లేచి.

"ఊరుకుంటూ ఉంటే మాఆటగాఉంది. ఏమిటీభైదు నాకు. ఎవరు నన్నుపట్టుకునే వాళ్ళు." అంటూ చిట్టెమ్మ వీరావతారలా గభాలున లేచి, తలుపు తెరుచుకొని బయట పడింది. నిరోధించడానికి అన్నపూర్ణకి సాహసం చాలింది కాదు. ఈగందరగోళం విని దీక్షతులుగారు గబగబా అక్క డికి చక్కావచ్చాడు. చిట్టెమ్మ పరుగిడివెళ్ళి, ఆయనపాదాల మీదపడి గొల్లున ఏడ్చింది. ఆయన ఎంత కోపంగావచ్చినా,

ఆక్షోపాగ్ని చట్టున చల్లారిపోయింది. నిర్విణ్ణుడై అలాగే నిలబడిపోయాడు. చిట్టెమ్మ కన్నీటిప్రవాహంతో తండ్రి పాదాల్ని కడిగింది.

"నాన్నా! ఎందుకు నన్నిలా శత్రువుణ్ణిమాదిరి కష్టపెడతావు! నీపితృహృదయం ఇలా కఠినమైపోయిం దేందు చేత. ఇదివరకున్న ఆప్రేమ ఏమయిందిప్పుడు! నాకష్టసుఖాలు విచారించకుండా, కేవలం, చెప్పుడుమాటలువిని, నన్ను ఇలా ఉసురుపెట్టడం తండ్రికి ధర్మమేమో! పెద్దవాడవు నువ్వే ఆలోచించు. అన్నీ తెలిసినవాడవు. ధర్మాధర్మ విచక్షణ మెరిగిన పండితుడివి, ఈవిధంగా అజ్ఞానుడులాగా నాయెడల ప్రవర్తించడం బాగుందా! చెప్పు నీకంతకష్టంగాఉంటే, చెప్పు, ఈలోకంలోనుంచే ఎడమైపోతాను."

## ౧౭

ఆరోజునుంచీ చిట్టెమ్మ చెరవ్రుదలిపోయింది. కాని దీక్షితులుగారి హృదయంలోఉన్న అనుమానం - అన్నపూర్ణ హృదయంలో ఉన్న ఈర్ష్య ఇవిమాత్రం మాయలేదు. తండ్రికి భయపడుతూఉన్నంతకాలం చిట్టెమ్మకి యమ

యాతన తప్పలేదు. "నువ్వెంత" అని మొదలకించిన ఉత్తర క్షణంనుంచీ ఆవిడ స్వాతంత్ర్యానికి మేర లేదు. పరాధీనతలో ఉన్న సంగతేలఅది.

కాని, ఆమె ఇంతటితో ఊరుకోలేదు. "నా" అనే వాళ్ళని - అంటే ఉన్నారుగా చలపతిరావుగారు కామేశ్వరమ్మానూ, వారిని పిలిపించి, అందరి సమక్షాన్నీ తన జీవన విధానాన్ని చర్చించడానికి కృతనిశ్చయమైంది. వెంటనే బయలుదేరి రావలిసిందని రాజమండ్రీ ఉత్తరంవ్రాసింది.

మరిరెండురోజులుకి చలపతిరావుగారు భార్యాసమేతంగా వచ్చారు. దీక్షతులుగారికి లోపల ఆయనమీద ఎంతకో్రధంఉన్నా పైకి మహాగౌరవం నటించాడు. కానైతే వారు ఎందుకొచ్చిందీ గ్రహించకపోలేదు.

కామేశ్వరమ్మ వచ్చినరోజునే మధ్యాహ్నం సుందరమ్మని చూడడానికి వెళ్ళింది. కాస్సేపు ఈమాటా - ఆ మాటా అయాక కామేశ్వరమ్మే ఎత్తుకుంది. చిట్టెమ్మసంగతి అసలు సుందరమ్మకి చిట్టెమ్మఅంటే అభిమానం - ప్రేమానూ. చిట్టెమ్మకికూడా ఆవిడంటే అంతగౌరవంగానూ ఉంటోంది. శాస్త్రాన్నిబట్టి ఏర్పడ్డది గాకపోయినా స్వతహాగా ఆమె మొదల చిట్టెమ్మకి సదూహే. ఇప్పుడు కామేశ్వరమ్మ చెప్పేవరకూ చిట్టెమ్మ మానవులనుభవించలేని కష్టాలకు గురియైనదని నిజానికి సుందరమ్మ ఎరగనే ఎరగదు. కాని

సవితితల్లివచ్చాక దీక్షితులుగారి మనసు కొంచెంమారిందని ఆవిడకి తెలుసు. చిట్టెమ్మ ఎన్నడూ చెప్పనేలేదు. ఇప్పుడు విని చాలా ఆశ్చర్యపోయింది.

"ఇదేంవిడ్డూరమమ్మా వ్రుదినా! ఎక్కడా చూడలేదు. కన్నకడుపనైనా చూడకుండా ఇలాచేస్తాడా ఆయన. ఏమన్నాసరేగాని వాళ్ళహృదయాలు కొరకరానికొయ్యలు" అంటూ సానుభూతి చూపింది సుందరమ్మ. ఆవిడ మనస్సు ఎలాంటిదో తెలుసుకోవాలని కామేశ్వరమ్మ ఊపిచూసింది. చాలవరకు సుందరమ్మ ఈవిడదారికే వ్రుచ్చింది. చిట్టెమ్మ లాంటి కూతురే తనకుంటే తప్పకుండా వివాహం చేసేద్దునని మాటలసందర్భంలో ఆవేశం తెచ్చుకొని అంది. ఈఅదను చూసుకొని కామేశ్వరమ్మ యుక్తియుక్తంగా - మనసుకరిగే లాగా నిర్బంధవైధవ్యంపేర జరుగుతున్న దౌర్జన్యాలు వర్ణించి చెప్పింది. వింటూన్నకొద్దీ సుందరమ్మకి నిజమేనని పిస్తోంది. అన్నిటికీ అంగీకరించింది.

"అయితేనూ చిట్టెమ్మకికూడా ఎందుకు చెయ్యకూడదూ" అంది సుందరమ్మ.

"తండ్రి చెయ్యాలిచే స్తే.మాకు సాహంత్రిం ఏముందమ్మా"

"తీసుకుపోయి మీరేచేసేద్దురూ ఆతరవాత ఆయనేం చెయ్య గలడు."

"ఏదో నేను తెగిస్తాననుకోండి. తల్లిలాగా దాన్ని కడుపులో పెట్టుకొని ఆదరించే మీలాంటి పుణ్యాత్మురాలు పూనుకొంటేనేగాని ఔతుందా"

"ఏ అమ్మైనా పూనుకొంటుంది."

"కాదుగాని వదినా! మీరు చిన్నప్పటినుంచీ చిట్టెమ్మని నాకంటె బాగా ఎరుగుదురు, దాని గుణాదుల విషయంలో మీ అభిప్రాయం ఏమిటండీ:"

"అదా: తులసి మొగ్గలాంటిది. నేనెరుగుదును. అది ఏ ఇంట్లో ఉంటే, ఆ ఇల్లు మహాలక్ష్మీమందిరమౌతుంది."

"ఈ విషయంలో మీ సహాయం ఎక్కువగా కావాలి."

"అభ్యంతరమేముంది. ఏ సంస్కారప్రియుడైనా తరుణుడు ఉంటే, నా శక్తి వంచన లేకుండా ఒప్పించడానికి ప్రయత్నిస్తాను. చిట్టెమ్మ సుఖం నాకూ కావలసిందే."

ఇంక దాపరికమెందుకు! కామేశ్వరమ్మ రామం యొక్క సంఘసంస్కరణాభిలాష - పరదుఃఖనివారణోత్సుకత మెచ్చుకుంటూ అతనికీ చిట్టెమ్మకీ ఏర్పడ్డ ప్రణయబంధాన్ని గూర్చి కూడా చెప్పేసింది. ఏతావాతా, మీరే చిట్టెమ్మ ఈ కష్టసముద్రంలోనుంచి బయటకు రావాలంటే, చేయూత ఇచ్చితీరాలి. మీరు నిరాకరిస్తే బుడుంగున మునిగిపోతుంది. ఆ పాపం మీదే. రక్షించిన పుణ్యమూ మీదే" అని నొక్కి చెప్పింది.

సుందరమ్మ విస్తుపోయింది. మరోపది నిముషాల వరకూ, ఆవిడ మాట్లాడలేకపోయింది. ఎవరికీ తెలియకుంత రహస్యంగా రామం ప్రణయనాటక మాడుతున్నాడని విన్నాక, అతనిమీద కోపంవచ్చింది. ముఖ్యం - మొఖం ఎరగనివీడా సంఘాన్ని ఉద్ధరించేవాడు: అనికూడా నిరసన భావం మొలకెత్తింది. ఇంతవరకూ తానుపలికిన వీరోక్తులన్నీ ఇట్టే మరుపుకొచ్చాయి. ఇంతకూ ఎవరికైనా ధర్మపన్నాలు ఏకరువుపెట్టడానికి అందరూ తయారే. తీరా తమ సంగతి వస్తే పప్పులో కాలుపడుతుంది.

కామేశ్వరమ్మకి ఏదో ఒక జవాబు చెప్పాలిగా ఆవిడ. చెప్పాలన్న సంగతి జ్ఞాపకం రాగానే, తాను పలికిన మాటలు తలపుకొచ్చాయి. దాంతో, అంతరాత్మ చిట్టెమ్మ విషయంలో వెనుదీయవలసిన సంధియుం ఏమీఉంచుకో కూడదని ప్రబోధించింది.

కామేశ్వరమ్మ మళ్ళీ చెప్పింది, ఇలాని. "వొదినా ! మీరు ఈవిషయంలో వెనకదీశారాఅంటే, ఆలోచించండి చిట్టిపని అధోగతైపోతుంది. అన్నివిధాలా, అది ఉత్తమురాలని మీరే అన్నారు. ఇక వైధవ్యవిషయం మొదలే ఒప్పుకోరుగదా, మీరు. సందేహమేముందిక."

దీపాలవేళైంది. మడిగట్టుకోవాలని సుందరమ్మ తొందరపడసాగింది. కామేశ్వరమ్మ లేచివెళ్ళుతూ "రేపు

వస్తాను. మీరుమట్టుకు హృదయంమీద చేయివేసుకొని ఆలోచించండి. చేయబోయేది మహాసంస్కారం. అన్న గార్నికూడా ఒప్పించేభారం మీదే. చిట్టికి తల్లిఅయినా, అత్తగారైనా మీరే. మీకడుపుచాటున పడిఉంటుంది." అంది.

కామేశ్వరమ్మ వెళ్ళినతర్వాత ఎంతసేపో తర్కించుకొంది మనసులో సుందరమ్మ. చిట్టెమ్మ తనకు కోడలవడం మహాభాగ్యమేననుకొంది. అయితే తనభర్త అంగీకరిస్తాడో లేదో! ఆయన ఒప్పుకొంటే బంధుజాలం ఒప్పుకోవద్దూ! కులంలోంచి వెలేస్తే చిన్నతనంగాదూ ! ఇలా ఎన్నోవిధాల ఆలోచిస్తోంది.

ఆరాత్రి భోజనాలైనపిమ్మట దీక్షతులుగారింట్లో సమావేశమయారు చలపతిరావుగారు - తదితరులున్నూ. నరసింహాశర్మగారుకూడా వచ్చారు.

చలపతిరావుగారు ఉపక్రమించారు. "చిట్టీ" నువ్వు చెప్పదలుచుకొన్నదేదో నిశ్శంకతో ఇందరి యెదుటా చెప్పెయ్యి. తెలిసిందా వీరంతా నీకు తండ్రులవంటివారు. ఇప్పుడు ఎందుకని ఊరుకొంటే ఇలాంటి తరుణం ఇకముందు గలగదు."

లోపలనడవలో కామేశ్వరమ్మ వుంది. గుమ్మంలో సగం కనిపించేలాగా నిలబడింది చిట్టెమ్మ. అన్నపూర్ణ పడక

గదిలో తలుపు ఓరగా వేసుకొని మంచంమీద కూర్చొని వింటోంది.

చిట్టెమ్మ తనతల్లి పోయినప్పటినుంచీ తాను అనుభవించిన కష్టపరంపర అంతా ఏకరువుపెట్టింది. తాను తల దువ్వుకొన్నందుకు తండ్రి కసరికొట్టటం - అన్నపూర్ణ తూలనాడడం - తండ్రి నగలువ్రెల్చుకోవడం అంతా చెప్పింది. రాజమండ్రినుంచి రాగానే తాను దేశసేవచేయాలనే ఉద్దేశ్యంతో ఈఇంట్లో ఉండడానికి మనసురాక చెన్నపట్నం బయలుదేరి పోతూఉంటే దీక్షితులుగారు పట్టుకొని తియ్యని మాటలు చెప్పి నమ్మించి ఇంటికి తీసుకొచ్చాక చీకటింట్లో ఖైదుచేయడం - మళ్ళీ ఆయన కనిపించకపోవడం - పూట పూటకీ అన్నపూర్ణ అన్నం తీసుకొచ్చి ఖైదీకిచ్చినట్టు పెట్టి పోవడం ఉన్నదున్నట్టు చెప్పేసింది.

విన్నవారందరూ ముక్కుమీద వేళ్ళుంచుకొన్నారు కన్నకూతుర్ని ఇలాచిక్కులుపెట్టడం కూడదని అందరి మనసుల్లోనూ తోచింది.

ఆమీద దీక్షితులుగారు చిట్టెమ్మనడవడి విషయంలో తానుపడిన దురూహ తెలియజేశాడు. ఆమాటకి చలపతిరావుగారు ఆయన ఉద్దేశ్యాన్ని ఖండిస్తూ - చిట్టెమ్మ ప్రవర్తనలో ఎటువంటిలోపమున్నూ లేదని నిష్కర్షగా చెప్పారు. "ఈఅనుమానపిశాచం ఆవేశించి మీరు తప్పుదారి తొక్కేరు కాని మరోటికాదన్నాను."

అదిగాక, చిట్టెమ్మ యౌవనహృదయంలో ప్రణయ బీజం ఎలాపడిందీ - ఎలా వృద్ధయిందీ - దానికి రామం చేసిన దోహదం - వారిరువురికి ఏర్పడ్డ అనురాగం - వారి పునర్వివాహ ప్రయత్నాలు - తాను చేయదలచుకొన్న సహాయం-అన్నీ యధాతధాగా చెప్పారు చలపతిరావుగారు.

ఇప్పుడు దీక్షితులుగారికి నిజం తెలిసిపోయింది తాను కేవలం చెప్పుడుమాటలకు లోబడిపోయి, అన్యాయంగా చిట్టెమ్మమీద అనుమానపడినందుకు చింతించాడు. కాని చిట్టెమ్మ పునర్వివాహం తలపెట్టడం అధర్మమనీ - పాపమనీ - అశాస్త్రీయమనీ, అంటూ - ఇలాంటి దుష్కృత్యానికి ఆమెను నడపడం చలపతిరావుగారిది తప్పని సూచించాడు.

చలపతిరావుగారు ఆవేశం తెచ్చుకొని, "శాస్త్రం శాస్త్రం అంటూ, యౌవనుల ప్రాణాలుతీయడం ధర్మమా! శాస్త్రసమ్మతమా !" అంటూ పూర్వాచారపరాయణుల దౌష్ట్యాలనీ - మూఢవిశ్వాసాలనూ - హేతుపూర్వకంగాని సంకెళ్ళనూ, ఖండిస్తూ, ప్రకృతి సిద్ధంగా మానవులకేర్పడిన హక్కులూ - తద్వినియోగం, నిరూపించారు.

వితంతూ వివాహం శాస్త్రసమ్మతమేనని వేదప్రమాణ్యాలు కూడా చూపారు. పురాణాల్లో ఉన్న ఉలూచి వివాహం మొదలైన ఘట్టాలు స్మృతికి తెచ్చారు. ముఖ్యంగా మానవధర్మంలో స్త్రీపురుషులకున్న సంబంధంస్పష్టపరిచారు. వృద్ధాప్యంలో దీక్షితులుగారు తిరిగి వివాహంచేసు

కోగా – అజ్ఞానావస్థలో వివాహం – అసలు మగని మొగ మైనా ఎరుగని అమాయిక బాలిక నిర్బంధ వైధవ్యానికి గురి అయి, ఆమరణాంతమూ తేజోహీనంగా – శవస్థితిని తల్చుకొని దుఃఖిస్తూ పడిఉండడం, ఏం న్యాయం, ఏం ధర్మం: చెప్పమన్నారు. "చతుర్వేదాలూ – అష్టాదశ పురాణాలూ తలక్రిందులుగా ఎరిగిన దీక్షితులుగారే, ఇంద్రియ చాపల్యానికి వశులైనప్పుడు – సృష్టిలో కామం ఎక్కువైన స్త్రీజాతి, అందులో నవయౌవన శోభావిలాసిని, ఇంద్రియాల్ని ఏలాబిగబట్టగల్దు!" దీక్షితులుగారి హృదయం మట్టుకు కదలలేదు. చలపతిరావుగారు చెప్పినమాటలన్నీ, నిరీశ్వరవాదులూ – వర్ణభ్రష్టులూ చేసే వితండవాదనలని ఆయన ఉద్దేశ్యం. అంతరాత్మ సాక్షిగా విచారిస్తే ఆయనకూ తెలిసేది. కాని ఛాందసం! బుద్ధిజాడ్య జనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్! చిన్నమ్మకు పునర్వివాహేచ్ఛ కలగడం, మానవధర్మానికి విరుద్ధమనీ – ఆపని రౌరవాది మహానరకాలకి దారి చూపిస్తుందనీ, దీక్షితులుగారి ఊహ. చచ్చేవరకూ ఒకరిపాదాలకింద అణగిమణగి ఉండడం కంటె – అగ్నిసాక్షిగా వివాహమై స్వేచ్ఛగా తాను ప్రేమించిన హృదయేశ్వరునితో సుఖించడం ఉత్తమమని ఆయనకు తోచలేదు.

అసలాయన శ్రోత్రియుల్లో తలతిప్పుకొంటున్నవాడు. ఆయన మనస్సు ఏమాత్రం అంగీకరించినా లోకులు

అపహాసింపరూ? కాకుల్లాగా పొడిచేస్తూరా? చివరకు నిర్మొహమాటంగా ఇలా అన్నాడు. "అన్నగారూ! కావలిసినవారని ఇంతవరకు చెబుతున్నా. చిట్టెమ్మనీ – దాన్ని గురించినన్నూ, అల్లరిపాలు చేయడానికీ – గౌరవం నాశం చేయడానికీ చూస్తున్నారు మీరు. మీమీద తగినచర్య తీసుకోవలిసొస్తుంది."

"మీదయ. అంత అనుగ్రహమే ఉంటే, ఇంకేం కావాలి. ధన్యోస్మి." అన్నారు చలపతిరావుగారు వెంకతనంగా.

దీక్షితులుగారికీ – నరసింహాశర్మగారికీ రామంకూడా ఇందులో ప్రధానపాత్ర వహించాడని తెలిసొచ్చింది. దీక్షితులుగారు రామంవల్ల ఇంతకొంప మునుగుతోందని నరసింహాశర్మగారిమీద ఉరిమారు. నరసింహాశర్మగారుకూడా వంశానికి అప్రతిష్ట తెస్తున్నాడని రామాన్ని మనస్సులో శపించాడు. రామం ఎదురుగాఉంటే ఈఇద్దరూ పీకిపిండి చేసేవారే.

అదిగాక, భార్యవల్ల కామేశ్వరమ్మకీ – ఆవిడకీ జరిగిన సంభాషణలో తెలుసుకొని, నరసింహ శర్మగారు, ఆమెమీద విరుచుకు పడ్డారు.

మొత్తానికి చలపతిరావుగారికీ – చిట్టెమ్మకీ – రామానికీ ప్రతికక్షలు బలమయ్యాయి. నరసింహాశర్మగారు దీక్షి

తులుగారితో భుజం కలిపి ఈ దుండగాన్ని ఆపడానికి నడుం కట్టుకున్నారు.

దీంతో చిట్టెమ్మ కంఠానికి ఉరిమరీబిగుసుకుపోయింది. సుందరమ్మగారింటికి వెళ్ళే ప్రాప్తం లేదింక చిట్టెమ్మకి. అన్నపూర్ణ కళ్ళు పచ్చకర్పూరం రాచుకున్నట్లు చల్లబడ్డాయి.

## ౧౬

రాయవెల్లూరు చెరసాలలో రామం మనుగుడుపు పెళ్ళికొడుకులా కాలం గడుపుతున్నాడు. అనేకమంది దేశనాయకుల్తో - పండితుల్తో - ఉత్తముల్తో పరిచయం కలిగింది. అనేక కొత్తవిషయాలు తెలుస్తున్నాయి. ప్లీడర్లూ - డాక్టర్లూ - కవులూ - పండితులూ - ఘనాపాఠీలు - చిత్రకారులూ - వారూ - వీరూ అన్నమాటేమిటి అన్ని కళలూ అక్కడ పోగుపడ్డాయి. ఈఅందరి మధ్యా అతనికి రోజులు ఆనందంగా గడిచిపోతున్నాయి కానైతే, రాత్రుళ్లు మట్టుకు కొట్టుల్లో బంధింపబడడంవల్ల చెరసాలలాఉంటోంది.

ప్రతిరోజూ రాత్రి సమయంలో కటకటాల తలుపు దగ్గిరకూర్చుని, ఊచలమధ్యనుంచి వస్తూన్న చల్లగాలికి

ఆనందిస్తూ - రామం చిట్టెమ్మని తల్చుకోకుండా ఉండలేక పోయేవాడు. తననుగూర్చి ఆవిడ ఏమనుకొంటోందోనని యోచించేవాడు. అతను నెలకు రెండు ఉత్తరాలు వ్రాసుకోవచ్చు. ఆ రెండూ ఇంటికే వ్రాస్తూవచ్చాడు. ఒక ఉత్తరం తన తమ్ముడు పేర స్కూలుకి వ్రాసి దానిని చిట్టెమ్మకి అందజేయించాలని అనుకొనేవాడు. తీరా ఉత్తరం వ్రాసేవేళకి తటపటాయించి వూరుకొనేవాడు.

ఇలా ఉంటూ ఉండగా ఒక ఉత్తరం వచ్చింది, చిట్టెమ్మ దగ్గరనుంచి. అందులో ఇంతవరకూ జరిగిన విషయాలు - చలపతిరావుగారు తలపెట్టిన సాహసం, అందులో ఉన్నాయి. రామం నమ్మలేదు. ఇది చిట్టెమ్మ వ్రాసిన ఉత్తరమేనా అనుకున్నాడు. ఔను. ఆవిడ వ్రాసిందే.

తెల్లవారగానే ఆ ఉత్తరం అందరికీ చూపించాడు. అతని ఉత్సాహం మిన్నుముట్టింది. పెద్దలంతా ఆశీస్సులు కురిపించారు. అదృష్టవంతుడవోయి రామం! సంఘానికి మంచి తెరువుచూపించావు: అన్నారు యువకులు. అందరి దృష్టిలోనూ రామం, ఆరోజు మొదలుకొని ఒక గొప్పసంస్కర్తగా కనిపించసాగాడు. అందరూ అతన్ని గౌరవిస్తూన్నారు. రామం ఉప్పొంగిపోతున్నాడు. అతని హృదయం రానున్న శుభదినాలకోసం గడియారం లాగా కొట్టుకొంటోంది

ఆరోజు మొదలుకుని తన విడుదల ఎప్పుడా అని రోజులు లెక్క వేసుకోవడం మొదలుపెట్టాడు. ఈ ఫైలుకి ఆ పైలు వారం. ఇంక ఎన్ని ఫైళ్ళున్నాయి! అని లెఖ్ఖ. జైలులో కాలమానం ఇది. ఏడులాకప్పులు ఒక ఫైలు. రెండు ఫైళ్ళు ఒక ఉత్తరం. రెండు ఉత్తరాలు ఒక తూనిక. తూనిక నెలఅన్న మాట. అలాంటి తూనికలు ఇక మూడున్నాయి రామానికి. అందులో రెమిషన్ క్రింద పదహారు రోజులు పోతాయి. నికరం రెండు నెలల పద్నాలుగు రోజులున్నాయన్న మాట.

ఇంతకుముందు మూడు నెలలూ ఇట్టే గడిచిపోయాయి ఇంక గడవడం కష్టమైపోయింది. రోజుకి ముప్పై మూరు గంటలా అనిపిస్తోంది. ఎలాగో కాలచక్రం మందకొడిగా తిరిగి - తిరిగి చివరకు వారంరోజులలో కొచ్చింది. రోజులు దగ్గరపడుతున్నకొద్దీ రామం హృదయానికి బీట్ ఎక్కువౌతోంది. ఆరోజున ఉత్తరాలు ఇచ్చేవాడొక. రామానికి పసుపురాచిన కవరు బుక్కుపోష్టు ఒకటి ఒచ్చింది. ఏదో శుభరేఖ అనుకొన్నాడు.

ఏదోఏమిటి తనకు సంబంధించిందే. విప్పిచూసుకొన్నాడు. కళ్ళుతుడుచుకొని - పెద్దవిచేసుకొని మళ్ళీ మళ్ళీ చూశాడు. ఆశ్చర్యమైపోయిందతనికి. కలలోకూడా ఇలా అవుతుందని ఎప్పుడూ అనుకోలేదు రామం. ఆశుభరేఖను గుండెలమీద ఉంచుకొని గంటలకొలది ఆనందించాడు.

అతని ఆనందబాష్పాలు చెక్కులమీదుగా జాలువారి శుభలేఖమీద పడ్డాయి.

ఒంటరిగా గదిలో కూర్చుని బిగ్గరగా చదివాడు. అది చలపతిరావుగారు వ్రాసిన శుభలేఖే అచ్చుది. ఆనందం పట్టలేక ఈశుభవార్త ఒకరిద్దరు మిత్రులతో చెప్పాడు. గాలిలా జైలంతా వ్యాపించింది. రామం అదృష్టానికి హర్షించనివారంటూ లేరు.

వారం గిర్రున తిరిగొచ్చింది. రామాన్ని ఆసాయింత్రం విడుదలచేస్తారు. ఇతని అభ్యుదయాన్నికోరే మిత్రులు-పెద్దలు కలిసి అతనికి విందుచేశారు. అందరూ ఆశీర్వదించారు. విధవఅయిన చిట్టెమ్మని సధవగాజేసినట్టే అనాథగా ఉన్న భారతమాతనికూడా ఉద్ధరించవలసిందని రామాన్ని హెచ్చరించారు.

రామం నెల్లూరులో రైలెక్కి, మధ్య ఎక్కడా ఆగకుండా సరాసరి వచ్చేస్తున్నాడు. సరిగా వివాహసమయానికే అతను చేరుకోవలసి వచ్చింది. తెనాలిస్టేషనులో చలపతిరావుగారు కలుసుకొన్నారు. రామం ఆనందాశ్రువులతో ఆయనకు నమస్కరించాడు. ఇరువురూ తెనాలిలోదిగి, గుంటూరుబండి ఎక్కారు.

ఇక్కడ బెజవాడ ప్లాటుఫారంమీద దీక్షితులుగారు నరసింహశర్మగారు – ఇంకా మిత్రులూ, రామంకోసం ఎదురు చూస్తున్నారు. ఇంట్లోఅన్నపూర్ణ ఏపనితొందరలోనోఉంది,

ఈసందట్లో చిట్టెమ్మ కృష్ణవృద్ధుకు బయలుదేరింది, కట్టుబట్టలతో. అక్కడ వశవసిద్ధంగా ఉంది. ఆవలిగట్టున మోటారుకారుతో కామేశ్వరమ్మ నిరీక్షిస్తోంది, చిట్టెమ్మ కోసం. చిట్టెమ్మ – పైడిశెట్టి, కలిసి, కృష్ణదాటి, మోటారుగా కామేశ్వరమ్మతో గుంటూరు వెళ్ళిపోయారు.

గుంటూరు పురమందిరంలో వివాహం జరిగే ఏర్పాట్లు. రోడ్డుమీద కార్లూ – బళ్ళూ ఎక్కడా తోవ లేదు. పచ్చ తోరణాలతో టౌనుహాలు కలకల్లాడుతోంది.

ఆశీర్వదించడానికి పెద్దపెద్దలంతా వచ్చారు. పెండ్లి మంటపం ముత్తైదువుల రంగు చీరల తళతళల్తో – విలాసినుల మధురహాసాల కిలకిలలతో – పండితుల వేద ఘోషలతో – ఒకమూల సనాయి పాటతో – చూడడానికి వచ్చినజనం తోడతొక్కుళ్ళతో హడావుడిగా వుంది.

వధూవరులు పెండ్లిపీటలమీద ఆసీనులయారు. కన్యాదాత – చలపతిరావుగారు సపత్నీకులై కూర్చున్నారు. పెండ్లితంతు యథావిధిగా – వేదోక్తంగా జరిగిపోతోంది. పండితులు ముక్తకంఠంతో ఆశీర్వచనబుక్కులు చదువుతున్నారు.

జనాన్ని పట్టతొక్కుకొంటూ, ఇంతలో దీక్షితులుగారు – వారివెనుక ఎర్రిటోపీలవారు, ఒక్కసారిగా వరద వచ్చినట్టు వచ్చిపడ్డారు.

పీటలమీదవారు పీటలమీదే నిర్విణ్ణులై కూర్చు న్నారు. చిట్టెమ్మకి పంచప్రాణాలూ తల్లడిల్లిపోయాయి, దీక్షితులుగారు కంటబడగానే. రామం మొఖంలో కత్తి వేటుకైనా నెత్తురుచుక్క లేదు. చలపతిరావుగారు వింధ్యా చలంలా నిశ్చలంగా - ధీమాగా అలాగేకూర్చున్నారు.

పోలీసుసర్కిల్ ఇనస్పెక్టరు గుసగుస ముందుకొచ్చి చలపతిరావుగారు - రామమోహనరావుగార్లకు వారంటు అంటూ కాగితాలు చేతికిచ్చాడు.

నొసట కల్యాణపుబొట్టూ- మెడలో కొత్తమంగళ సూత్రాలూ ఆవెడా, చిట్టెమ్మ గభాలునలేచి తండ్రి పాదాలమీద పడి విలపించింది అన్యాయంగా పాలల్లో విషం కలపొద్దని దీక్షితులుగారు విదలించుకొని దూరంగా పోయారు. ఆబాలగోపాలం దీక్షితులుగార్ని దుయ్యబట్టు కున్నారు

"నువ్వు చేయలేకపోయినా అట్టేపోయింది కాని ఈ ఆనందసమయంలో దుఃఖప్రవాహాన్ని ఎందుకయ్యా పొర్లించు కొస్తున్నావు! నీకు సూనవత్వం - దయాదాక్షిణ్యాలు ఏ కోశానైనా ఉన్నాయా" అన్నారు కొందరు.

చలపతిరావుగారు - రామం జామీనిచ్చారు. కేసు వాయిదావడింది. అన్నెం - పున్నెం ఎరగని చిట్టెమ్మకి దుర్బోధచేసి, సంఘనియమాన్ని - కుటుంబగౌరవాన్ని చెడ

గొట్టి తనకు మానసనష్టం కలిగించాడనీ - తనఅభిప్రాయానికి విరుద్ధంగా తనకూతుర్ని పాడుచేయడానికి పూనుకొన్నాడనీ దీక్షితులుగారు చలపతిరావుగారిమీద కేసు తెచ్చారు. రామం యౌవనమదాంధతవల్ల తన కుమార్తెను మోసపుచ్చి అపవిత్రనుచేశాడని, అతనిమీదా కేసు.

"వివాహం నిర్విఘ్నంగా అయినందుకు సంతోషిస్తున్నాను. నాచేతులారా నేను ప్రాపులేని ఒక వనితాలతకి ప్రాపుకలుగజేశాను. ఆపుణ్యాం నాకు అండగాఉండగల్దు. ఇంతటి మహాకార్యం చేయగలిగినందుకు గర్విస్తున్నాను. నేనుచేసినపనికి ఖేదు ప్రాప్తించనీ. నేను భయపడను. సంతోషంతో అనుభవిస్తాను. ఇంకాకొన్ని ఇలాంటి వివాహాలే జరిపించి ఆమరణాంతమూ చెరసాలల్లో మగ్గిపోవడమే నేను కోరేదిన్నీ. దీక్షితులుగారుకానీ - ప్రభుత్వంగానీ ఈనూత్నదంపతుల పవిత్రమైన ఈవివాహబంధనాన్ని త్రెంపలేరు, వీరిహృదయాల్లోఉన్న అనురాగాన్ని పారదోలలేరు. నన్ను దండించనీయండి. రామాన్నికూడా శిక్షిస్తారా! అహా ఈఉద్యమం ప్రచండవేగంతో దేశం నాలుగుమూలలా అలుకోడానికి కారణమౌతుంది. ఇలాంటి నిర్బంధాలూ - అత్యాచారాలూ కలుగుతేనేగాని త్యాగం యొక్క అవసరం కనిపించదు. త్యాగంలేకుండా సంకల్పం స్వచ్ఛంకాదు. సిద్ధినొందదు. ప్రేమకూ - త్యాగానికీ

ధైర్యానికీ - దురాచారసంస్కరణానికీ ఫలం చెఱసాల కాబోలు ఆహా! కలియుగా - ఎడబాటూ ఒకేముహూర్తాన్ని ఏర్పడింది చిట్టికి. నిష్కల్మషము - ప్రేమమయమూ అయిన చిట్టెమ్మ లేతహృదయంలో నుంచి వెలువడే ఒక్కొక్క వియోగదుఃఖనిశ్వాసాగ్నిజ్వాలా జగతునంతనీ క్రమ్మి పూర్వాచార చాంధసారణ్యాన్ని భస్మీపటలం చేస్తాయి'' అన్నారు. ఆవేశంతో చలపతిరావుగారు.

రామం "దేనికైనా సంసిద్ధుడనే" అన్నాడు.

వాయిదానాడు జడ్జీగారు కేసువిచారించారు. ముద్దాయిల తరఫు ప్లీడరు వీరుచేసింది దేశానికి మహోపకారమే గాని దోషంకాదన్నారు.

"హృదయపూర్వకంగా చిట్టెమ్మ రామాన్నివరించి వివాహంచేసుకొంది. మానవసహజమైన హక్కు ప్రతి వ్యక్తికీ ఉంది. దుఃఖభారంచేత అణగారిపోతూ ఉన్న బాలికను ఉద్ధరించినందుకు చలపతిరావుగారు పూజనీయుడు గాని- దండనార్హుడా !" అన్నారు.

జడ్జీగారు విచారించి, చలపతిరావు - రామమోహనరావుగార్లు నిర్దోషులన్నారు. పైగా ఇది సక్రమమైన వివాహమేనని చెబుతూ - చిట్టెమ్మ తాలూకు ధనం ఆమెపరం చేయవలసిందేనని తీర్పు చెప్పారు.

యావజ్జీవం సుఖంజీవేత్ నాస్తిమృత్యోరగోచరః
భస్మీభూతస్య దేహస్య పునరాగమనం కుతః॥

సంపూర్ణము.

# సరస్వతీ గ్రంథమాల

కాకరపర్రు - పశ్చిమగోదావరిజిల్లా.

స్థాపితము 1923.

ఈ గ్రంథమాలయందు మూడు మాసములకొక గ్రంథము చొప్పున నవలలు, నాటకములు (సాంఘిక, చారిత్రాత్మక,) ప్రచురింపబడుచుండును.

సంవత్సర చందా రు. 2-8-0

ప్రవేశ రుసుము 0-2-0

| | శాశ్వత చందా. | సంవత్సర చందా. |
|---|---|---|
| మహారాజపోషకులు | 500-0-0 | 50-0-0 |
| రాజపోషకులు | 250-0-0 | 25-0-0 |
| పోషకులు | [illegible]-0 | 12-8-0 |
| సహాయులు | [illegible]-0 | 5-0-0 |

